## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# సుభద్రార్జునీయము.

గ్రంథకర్త

ధర్మవరము గోపాలాచార్యులు

వకీలు, బళ్లారి.

(రామదాసు నాటక గ్రంథకర్త.)

---

అతనిమేనల్లుండగు శ్రీయుత టి. రాఘవాచార్యులకు

అంకితము.

మొదటి కూర్పు.

బళ్లారి.

నారాయణ పవర్ ముద్రాక్షరశాలయందు ముద్రితమై

గ్రంథకర్తగారిచే ప్రకటితమైనది.

1932.

 [వెల రు. 1—0—0.

# పీఠిక

---

పరమాత్మ నిర్గుణుఁడనియు, సగుణుఁడనియు, మఱియుఁగుణనిధియనియు విజ్ఞానులు నిరతిమైవినుతించుచుందురు. సర్వవ్యాపకుఁడైయుండినను, సర్వమునకుఁ బ్రత్యేకుఁడైయుండుటచేత బరమాత్మనిర్గుణుండనబడును. శ్రీరామాద్యవతారంబుల నెత్తుటచేత, సగుణుండనఁబడును. దయాదాక్షిణ్యాద్యనంత కల్యాణ గుణాత్మకుఁడై యుండుటచేత గుణనిధియనంబడును. పరమాత్మ భూలోకంబున కవతరించు కారణంబును, భగవద్గీతమూలమున, ప్రపంచమునకు విదితమగు తెఱఁగున బ్రకటించిన యవతారపురుషుఁడే శ్రీకృష్ణుఁడు. అతనిదోడఁబుట్టువే సుభద్ర. నారాయణుఁడగు కృష్ణుని మిత్రుఁడేనరుఁడు—అతఁడేయర్జునుఁడు. దేవకిదేవి యొక్క సప్తమగర్భమునందుండిన శిశుపిండము యోగమాయవలనగర్షితమై రోహిణీదేవియొక్క గర్భంబున జొనుపఁబడి యుదయించినవాఁడె సంకర్షణ నాముండగు బలరాముడు. రోహిణియు వసుదేవుని భార్యయగుటచే కృష్ణునకు బలరాముడగ్రజుఁడగును.

యాదవవృద్ధులందఱును సుభద్రనర్జునునకుద్వహించునట్టి యుత్సాహంబున నుండిరి. ఈవార్తను యాదవవరుఁడగు గదుఁడుపార్థునకు వినుపించియుండెను. ఇందుచేత ద్వారకయందు సుభద్రయు, నింద్రప్రస్థంబునఁబార్థుండును బరస్పరప్రేమానురాగంబులను వర్ధిల్లజేయుచుండిరి. కాని, బలభద్రుని యోచనవేఱుగనుండెను. పాండవులసంపదకో అంతమై, దుర్యోధనునకు హస్తినాపురి రాజ్యభాగ్యభోగములభించినందున, సుభద్ర సుయోధనుని పెండ్లియాడిననే సుఖించునని బలరాముఁడెంచి, పెద్దలయుద్దేశంబునకు విరుద్ధంబుగవర్తించి, తనపట్టును సాధింప నిశ్చయించెను. లోకసృష్టియందలి భవిష్యములనెఱింగిన కృష్ణుఁడు కపటనాటకసూత్రధారుఁడు గనుక, తనశేషాంశ సంభూతుఁడగు బలరామునియొక్క స్తబ్ధజ్ఞానమును త్తేజింపఁదలఁచి, హలధరునిక్రియలకు బ్రతిక్రియలనొడ్డి, సుభద్రార్జునుల మానసంబులందు బ్రసరితములై యుండిన కోర్కెలను నెఱవేర్చెను. యోగమాయాంశయగు భద్ర, దైవనిర్ణితమగు బ్రోత్సాహంబును సుభద్రకొసఁగి, వేరొక్కరెఱుంగజాలని తీరున సుభద్రార్జునుల సమావేశమొనగూర్చి వారివివాహమునిర్వహింపజేసెను.

ఈనాటకమును నేను 1915 సంవత్సరమునందెరచించితిని. అప్పటినుండిప్ప టివఱకు నిది పదేపదే శ్రీయుత టి. రాఘవచార్యులవల్ల ననేకప్రదేశములయందు బ్రదర్శింపబడుచున్నది. శ్రీకృష్ణుని చరితమును చదివి వినునట్టి వారలకే హృదయానందమును, హరిభక్తియును సిద్ధించుచుండ, శ్రీకృష్ణుని చర్యలనభినయించు వారియభినందనమమేయమైవెలయునని చెప్పనేల?

ఈనాటకమునచ్చుగూర్చినపుడు ప్రూఫులలో చిన్నతప్పులు లేక చక్కగ సిద్ధపఱచుచు, దమకుబనులు మెండుగనుండినను 40 దినములలోనె పూర్తిగ్రంథమును ముద్రించినట్టి బళ్లారి నారాయణ ఫవర్ ముద్రాక్షరశాల వారికిని తదధికారియగు శ్రీయుత కె. నారాయణప్పగారికిని నేనెంతయు గృతజ్ఞుండనై యున్నాఁడను.

1932 సం॥ డిశంబరు.

ధర్మవరము. గోపాలాచార్యులు
గ్రంథకర్త.

ఓం శ్రీ.

# శ్రీసుభద్రార్జునీయము

## ప్రస్తావన.

[సూత్రధారుడు-ప్రవేశించి-నాందిపద్యము.]

సీ॥ శ్రీమానినీమణినే మాననీయుండు-ప్రేమానహృదిపైన-వెలయునునిచె ।
నాగేంద్ర భరణమే-భోగీంద్రశయనుఁడు యోగీంద్రులెగ్గించు-నోజజేసె ।
ఆశ్రీనవములాత్మ్వె-యేశ్రీనపాలుఁడు-మోదానయదువంశ-మాదరించె ।
పాపులౌనృపతుల నేపావనుఁడుదున్మి-యాపాండవేయుల-యాపదాపె॥

గీ॥ ఏదయాశీలుఁడర్జునుఁ డెలమిమీఱఁ ।
గామిని సుభద్రఁజేపట్టు కాంక్షమదిని ।
బెంచి సన్యాసి కాఁగదాఁ బెండ్లిఁజేసె ।
నాకృపాళుఁగృష్ణుభజింతు-నధికభక్తి॥

[ప్రవేశము-నాగకన్య]

నాగకన్య:— ఆర్యా! కృష్ణసోదరి సుభద్ర పాండుపుత్రుఁడగుఁ బార్థునిఁ బెండ్లియాడునంతటి పుణ్యము నోచియున్నదా? ఆయమకోర్కె నెఱవేఱఁగలదా?

సూత్ర:—అవశ్యము నెఱవేఱఁగలదు.

నాగ:—అదియెట్లు సిద్ధించును?

సూత్ర:— కం॥ లలనామణిహరిసోదరి ।
కలవాణి సుభద్రపార్థసంగమునుబడయున్ ।
వలపున నోచిననోముల ।
ఫలమున నాపాలతికేగ-ఫల్గుణుఁబొందున్॥

నాగ:—ఆర్యా! ఈతరుణమున నాతరుణీమణివాంఛ సమకూరఁజాలదు.

సూత్ర:— ఎందుకు?

నాగ:— క॥ అరవిందాక్షియులూపియు ।
భరమగుమోహంబుఁజెందు-పార్థునిఁబడయన్ ।
హరిసోదరయెంతదరిన ।
వరకన్యయులూపితోల్త-ఫల్గుణుఁబొందున్॥

ఆర్యా! సుభద్రయొక్క నోముఫలము, మాయులూపిదేవియొక్క నోముబలమును మీాఱఁజాలదు సుమాా!

సూత్ర:— బాలా! ఇదియేటి మాట?

నాగ:— మా యులూపిదేవి గంగాతీర్థముననుండిన యర్జునునిఁ గాంచి యతనినిఁ బొందుటకై ముందంజవేసియున్నది. ఆయమ చేతులనుండి తప్పించుకొనినకదా పార్థుఁడు సుభద్రనో బలభద్రనో పెండ్లియాడునది?

సూత్ర:— అట్లనా? ఏమగునో చూతము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

[ప్రవేశము-బ్రాహ్మణులు-విశారదుఁడు-గంగాధరుడు.]

గంగాధర:— విష్ణుపాదా! ఇదియేమాశ్చర్యము? గంగయందు స్నానమాచరించుచుండిన యర్జునుఁడున్నట్లుండి కన్నులకగపడకుండనెట్లు ఖూాయమాయెను?

విశారద:— గంగాధరా! ఈభాగీరథీదేవి పరమపవిత్ర. పాండుపుత్రునకు మనము రక్షగనరుదెంచి యుండినందున, మనభక్తి శక్తులను పరీక్షించుటకై యీగంగాదేవియే పార్థుని యెందో దాచియుండును. నేనిప్పుడె యీగంగలో మునిగి శ్రీకృష్ణుని కృపచేత మన పార్థుడు పాతాళమందున్నను పోయి తోడ్కొని వచ్చెదను. (అనిసిద్ధపడును.)

[ప్రవేశము-నాగకన్య.]

నాగ:—బ్రాహ్మణోత్తమా! గంగలో మునిగిపోవునంతటి సాహసము మీాకేఁదుకు?

విశా:— నీవెవ్వతెవు?

నాగ:— నేను వనదేవతను.

విశా:— నీవు వనదేవతవైన మాపార్థుఁ డేమాాయెనో చెప్పుము.

నాగ:— పార్థునిఁ బాము పట్టియున్నది.
బ్రాహ్మణ:— అది యెట్టి పాము?
నాగ:— నావెంటరమ్ము చూపెదను.
(అందఱు నిష్క్రమింతురు.)

## ప్రథమాంకము-ప్రథమరంగము.

ఉలూపి సౌధము.

అర్జున:— (పాన్పుపైన పరుండియుండును.)
(ప్రవేశము-నాగకన్య.)
నాగకన్య:— పాట (అనుబంధము 1)
(పాడి-యర్జునునిపైనఁ బన్నీరు జల్లిపోవును.)
అర్జు:— (దిగ్గునలేచి) కన్నులఁదుడుచుకొని, యుడుపులఁ బరికించి చుట్టుపక్కల వీక్షించి-యాశ్చర్యమున, మంచము దిగివచ్చి) విశారదా! గంగాధరా! (అని పిలుచును. ప్రత్యుత్తరము లేదు) నేనిప్పుడెచ్చోట నున్నాఁడను? నేను స్నానమాచరించుచున్న జాహ్నవీ నదియేది? నామిత్రులేరి? బ్రాహ్మణోత్తములేరి? నా యంబరములుపోయి, యీయుడుపు లెట్లువచ్చెను? ఈతొడుగు లెవ్వరివి? హంసతూలికాశయ్య యెక్కడిది? ఇదంతయు గల్లయా నిజమా?

సీ॥ ఇదియేమియాశ్చర్య? మీసౌధమెవరిది? ఇందులకెటు వచ్చియుందు నేను?।
నామిత్రులేమైరి? నాయాత్రయెటుఁబోయె? గంగాతరంగిణి-కానరాదె
స్వప్నమోయిదిలేక-వాస్తవంబోకాక-కనులకు బెనుమబ్బుగ్రమ్మెనొక్కొ।
నిదురలోనునికియో-బెదురులోనునికియో-నిక్కమోకల్లయో-యెుక్క
తెలుఁగ।

గీ॥ తెలివినను బాసిపడిఁజనుదేరనేమొ।
పలుకులాడెదనో లేక-పలువరంబొ।
మనుచునున్నాఁడనో లేక-భ్రమందినానొ।
నేనుపార్థుఁడనగుదునో-కానొ తెలియ॥

ఊరకపల్లటిల్లి యేమిప్రయోజనము? వాస్తవమునరయుదారినిఁ బరికించెదను. (అనిముందునడచి పైనున్న కోలాటము త్రోళ్ళను దాఁకును-వెంటనేగానమువినఁబడును)

నాగకన్య:— (లోపలినుండిపాడుదురు పల్లవిమాత్రమే)

పాట-అనుబంధము 2.

అర్జున:— ఈత్రాళ్ళు గానముచేయును. కావున యిది గంధర్వ సాధము. ఈకమనీయ గానమునుఁ జెవులవిందుగవిని, పిదప నితరము విమర్శించెదను.

(అని త్రాళ్ళను బిగ్గరగనల్లాడించివిడుచును)

నాగకన్యలు:— (రంగమున కరుదెంచి పాడి కోలాటమాడి నిష్క్రమింతురు)

ఉలూపి:— (రహస్యముగవచ్చి పాన్పుపై నగూర్చుండును.)

అర్జున:— గంధర్వాంగనలారా! రండు. (అని పిలుచును. ఎవ్వరును పలుకరు.) నేను గానమువిన్నదికల్ల. అంగనలను గాంచినది యబద్ధము. కాళ్ళకు మన్ను సోకదు. కన్నులకు మిన్ను తోఁపదు. కలలోనడచుచు నేనున్మాదుఁడనై యున్నాఁడను. తీర్థస్నానంబులచేతఁ దల దిమ్మెకలిగియున్నది. ఇంచుక నిద్రించిన నీచిత్త భ్రమతీరునేమొ! (అని వెనుకకు దిరిగి పాన్పును సమీపింపఁగ నులూపిని గాంచి, బెదరి నిలిచి) ఈకామిని యిచ్చట నేలయున్నది? ఈ జవ్వని యెవ్వతె? వ్రతమాచరించుచుండు నాగతి యిట్లేందుకాయెను? అకటా! పూతమగు యాత్రయొక్క ఫల మింతటి పాపజవము కావచ్చునా?

(ప్రవేశము-నాగకన్య.)

నాగ:— రాజనందనా! నీయాత్రాఫలము. పాపజవముకాదుఁ-పాఁపజవరాలు.

అర్జున:— నీవెవతెవు?

నాగ:— నేనొక పాఁపజవరాలను.

అర్జున:— అట్లన్న నేమి?

నాగ:— నేను నాగకన్యను.

అర్జు:— ఈచోటెద్ది?

నాగ:— ఇది నాగలోకము.

అర్జు:— నన్నిచ్చటి కెవ్వరు తెచ్చిరి?

నాగ:—నన్నేఁదుకడిగెదవు? మా రాణి యులూపిదేవినే యడుగుము (అని యులూపినిజూపి పోవును.)

విశారద-గంగాధర:— (రహస్యముగవచ్చి చాటునగూర్చుందురు.)

అర్జు:—ఇప్పుడంతయుఁ దెలిసెను. ఈమాయలాడి నావ్రతభంగము గావింపదలంచి, మోసరీతిగ నన్ను దెచ్చియున్నది. ఈకామిని నానోమును భంగపఱపఁగలదా? కాని-దీనినిఁ దగురీతిగ దండించి నాదారి నరిగెదెను. (అని యులూపిని సమీపింపబోయి-నిలచి) ఆహా! ఇది చంద్రవదనకాదు. నిక్కఁపు చందమామ. కావుననే నాకోప తాపము చల్లగాయెను.

ఉలూపి:— (పక్కున నవ్వును.)

అర్జున:— ఏమి? ఇంతటిపరిహాసమా?

ఉ॥ చక్కని ముద్దుమోముగన-జల్లగనాయె విరోధ మంతయుఁ‌
చక్కరబొమ్మ నవ్వువిని-సంతసమూరు ముదంబుచేసుటెఁ‌
ఇక్కమలాక్షి గాంచిమది-నింతయుదాల్మి చెలంగ దాయెనే।
నెక్కడ? యీభుజంగజగ మెక్కడ? సర్పము నోటఁజిక్కితిఁ‌॥

ఛీ! నావ్రతభంగ మొనరింపబూనిన యీకామినియెడ నాకింత భ్రాంతిచెల్లదు (అని ధైర్యమున) కాంతా! నీవింతటి ధూర్త కార్యమేల నొనరించితివి?

ఉలూపి:— ధూర్తుఁడవైన నీయపరాధములకుఁ దగుశిక్ష విధించుటకు నిన్నుఁ దెచ్చితిని.

అర్జు:— నాయపరాధములేవి?

ఉలూపి: — నీయపరాధములను వరుసగ లెక్కించి చెప్పెదవినుము.

సీ॥ లోకసుందరుఁడైన-నాకేశుప్రేమంపు-పుత్త్రుఁడై పుడమిపై పుట్టుటొకటి।
పరువంపు ప్రాయాన-మురిపెంబులలరించి-యింతుల వలవంత నిడుటరెండు।
భువన మోహనరూప-భూపాలసూనుఁడు-కవ్వడి యనుకీర్తిఁగనుట మూడు॥
ఉరువునందము జూప-నురగభామినులుండు-సరసులు నదులఁజనుట నాల్గు

గీ॥ చెలులఁ దమకించు శృంగార-చేష్టలైదు।
పడఁతుల మఱగించు-మధుర-భాషలాఱు।
గణుతిఁజేయంగ నింకెన్నొ-గలవు పార్థ।
చెప్పుము నీతప్పులకు శిక్షఁజేయవలదె!॥

అర్జు:— (ఆత్మ) ఔరా! ఈనారీమణి చాతుర్యము! ఈనాగసుకన్య చమత్కృతికి నేను సోలఁగూడదు.

ఉలూ:— రాజనందనా! మారుపలుకకూరకున్నాఁడ వెందుకు?

అర్జు:— నాగరాజనందనా! నీమాటలకు నాకు మిగుల విచారమగుచున్నవి.

ఉలూ:— నీనేరములభారమునకు విచారము గలుగకుండునా?

అర్జు:— అటుకాదు. నన్ను శిక్షించుటకు నీవు సమర్థురాలు కావని చింతించెదను.

ఉలూ:— ఏలకాను?

అర్జు:— నీకును నాకును విరోధాంశములు పెక్కులున్నవి.

ఉలూ:— అవియేవి?

అర్జున:—

సీ॥ న్యాయమెట్లుఘటించు-నాగసుతవు నీవు-నాగారిసుతుఁడేను-నరరుభోణి।
అనిల భక్షణఁజేయు-వనితవైతివి నీవు-అనిలపుత్రునకు నే-ననుజుఁడైతి।
వీనులు కండ్లాయె-వేరె చెవులులేవె-నేరంబు వివరింప నేర్తువెట్లు?।
పదగ హస్తములాయె-బరగ చేతులెలేవు-లేఖనంబుకు చెయ్యి-లేదు నీకు॥
గీ॥ మగువ! భూలోకవాసుఁడో-మనుజుఁడేను।
నాగలోక నివాసియో-భోగినీవు।
వ్రతిని నేను సుఖవిలాస-వతివినీవు।
తగవుకాదె నీభావంబు-తరళనేత్ర!॥

అతివా! నీచతురతకు నేను మెచ్చితినిగాని, నీకు నాకు నెట్లు జత పడును?—నేను భూకాంతుఁడను, నీవు భుజగకాంతవు. నన్ను గోరుట పాడికాదు.

ఉలూ:— పార్థా! మున్ను నాగకన్నియలను నరనాథపుత్రులు వరింపలేదా? కుశుఁడు మాకు ముద్వతిని, పురుకుత్సుఁడు మా నర్మదనుఁ బెండ్లియాడలేదా?

అర్జు:— కాంతామణి! యేది యెట్లుండిన నన్ను ద్వహించునట్టి వాంఛను వదలుము.

ఉలూ:— అదియేల?

అర్జు:— నేను వివాహితుఁడనని నీవెఱుఁగవు కాబోలు?

ఉలూ:— ఎఱుఁగకేమి? పాంచాలి నీకొక్కనికే పత్నియగునా? అది యెట్లయినను నన్ను ద్వితీయగా స్వీకరింపుము. నేను సమ్మతింతును.

అర్జున-ఉలూపి:— (సంభాషణ పాట) (అనుబంధము-3.)

అర్జు:— తరుణీ-నాయొక్క తీర్థయాత్రావ్రతము తీఱువఱకు నీ కోర్కెను నేను నెఱవేర్పజాలను.

ఉలూ:—పార్థా! నేనును వ్రతముబట్టియున్నానే అదియు తీఱవలెను కదా?

అర్జు:— కాంతా! నీవ్రతమేది?

ఉలూ:— రాజనందనా! నేను నాగరాజగు నైరావతుని సుతను. కన్నెను. నీరూపలావణ్యములు వినుతించుచు నాగాంగనలు పాడు గీతములు విన్ననాటనుండి, నిన్నే నాథునిగ వరింప నిశ్చయించి నాకోర్కె చేకురుతరిని వేచియుంటిని. నీవు భాగీరథిలో స్నానమాచరించుచుండ నా మోహము నిన్నిచటికి రప్పించినది. కావున నేడే నిన్ను గాంధర్వంబునఁ బెండ్లియాడవలయుననునదే నావ్రతము. నావ్రత పూర్తికాకపోయిన నీకు స్త్రీహత్యాదోషము సంభవించును. కావున నన్ను కాపాడుము. (అనిపాదములపై పడును.)

అర్జు:— వనితామణీ! నేను వ్రతభంగమాచరించితినేని యందుల ఫల యేమగునో నీకు దెలియునా?

విశారద-గంగాధర:— (తటాలున ప్రవేశింతురు.)

విశారద:— పార్థా! నీవ్రతభంగఫలము వేదవేత్తలగు మాకు జక్కగఁ దెలియును.

అర్జు:— అది యెట్టిఫలమో చెప్పుడు?

విశా:— నీవ్రతభంగఫలము, యులూపిదేవికి పుత్రోదయము.

అర్జు:— బ్రాహ్మణోత్తములారా! నాకు పాపము రాకుండ ననుగ్రహింపుఁడు.

విశా:— నీవీమెను పరిగ్రహించుటయే మా యనుగ్రహము. ఒనర్పుము. పాణిగ్రహణము.

అర్జు:— కాంతా! నీకరమునిమ్ము (అని చేయిబట్టబోవును.)

ఉలూ:— (వెనుకకు జరిగి) నాథా? నాకుఁగరమే లేదంటివే.

అర్జు:— సారసాక్షీ! నీ సరస శృంగారమునకు నేను సంతసించితిని.

ఉలూ:— నాథా! నీవాక్కులు వినుటకు నాకు చెవులులేవే.

అరు:— మానినీ! నాతప్పులను మన్నించి నన్నేలుకొమ్ము.

సంభాషణ పాట-(అనుబంధము 4)

బ్రాహ్మణులు:— సుముహూర్తము సమీపించెను కల్యాణము గావింపుఁడు.

వివాహము-పాట (అనుబంధము 5.)

---

## ప్రథమాంకము - ద్వితీయరంగము.

చిత్రవాహనుని పుర బహిర్భాగము.

[ ప్రవేశము - ఘటోత్కచుఁడు. ]

సీ॥ భీకరదుర్గముల్ భేదించి ప్రతిపక్ష-వర్గంబుమర్దించి-బడలనైతి ।
భూధరమదరించి-భూరుహంబులఁద్రెంచి-ప్రాగ్భారములఁద్రుంచి-బడలనైతి
అంభోధిస్తంభించి-గంభీరమునమించి-భద్రకుంభినిఁజించు-బడలనైతి ।
ఒడబాగ్నినడఁగించు-చెడిదకృత్య మొనర్చి-ఖండనంబదరించి-బడలనైతి॥
గీ॥ ఇపుడుపనిబూనియా పాండు-నృపతిసూను ।
విజయునిమనికి నెఱుఁగంగ-వెగటుపడుచు ।
విపినజనవాసభూములన్-వీడులెల్ల ।
దడవిబెడియుచుఁదడఁబడి-ఒడలినాడ॥

ఆహా! దారుణసంగ్రామరంగంబున గర్వితపరి పంథిపరివార నిర్మూలనముఁ జేయుటపోయె. దురిత కృత్యానురక్త క్రూరారాతి

పరిభూతధరాధీశుల పరిపాలించుటపోయె. దుర్మదదైత్య పీడిత నిర్మల ధర్మయుక్త కర్మందుల రక్షించుటపోయె. దుడుకులు కడలుకొను చెడుగుచేతల కడగండ్లుబడు, పుడమివేల్పులకుం దోడ్పడుటపోయె. ఇంచుమించుమేని యంచయాన వరించనెంచు నించువిల్తుసంచు వన్నెకాని నన్వేషించుటపోయె. చెలువునలువు వెలయంగలువరాయనింబోలు విలాసింజేపట్టిం గులుకులొలుకు చిలుకల కొలికిని నెమకుటపోయె. ముల్లోకంబులం మేటివిలుకాడను విశాలయశంబుంగన్న విజయుని వెదకుచున్నాండనే. కడిమి నిశాచరుండగు నేను బడుగుచారుండనైతినే. నాజనకుండు భీమసేనుండు నన్నెట్టిపనికి నియమించెను? అతనిపత్రికయందిన వెంటనే ధనంజయు నన్వేషించుచు జాడంబట్టి యీచిత్రవాహనుని పురంబునకు నరుదెంచితిని. పార్థుండుబూనిన యాత్రావధియంత్యమై యెంతయోకాలమైయున్నను నింద్రప్రస్థంబునకు మరలి రాండని, మావారు చింతాగ్రస్తులైయున్నారు. ఈనగరమున మానరుండు లేకున్న ముందేమిచేయుదును?

(ప్రక్కకునిలచును.)

[ప్రవేశము-ఇలావంత-బభ్రువాహనులు.]

ఇలావంత-బభ్రు:—(బంతులాడుచు) పాట (అనుబంధము 6)

బభ్రు:— (ఘటోత్కచునిపైన చెండువేయును.)

ఘట:— ఎవ్వండు నన్ను బంతితోగొట్టినది?

బభ్రు:— నేను (అని యెదపైచెయ్యిడిచూపి నిలచును)

ఘట:— బాలకా! నీవెవ్వండవు?

బభ్రు:— నేను వానిదమ్ముండను. (ఇలావంతునిజూపును)

ఘట:— (ఇలావంతునితో) కుమారా! నీవెవరవు?

ఇలా:— నేను మాయయ్య కుమారుండను.

ఘట:— మీయయ్య పేరేమి?

ఇలా:— విజయరాజు.

ఘట:— (స్వ) విజయుం డెవ్వడైయుండనోపు? మావిజయుండేయగునా? (ప్ర) బాలకులారా! మీముద్దుపేరు లెయ్యవి?

ఇలా:— నా పేరు ఇలావంత.
బభ్రు:— నా పేరు బభ్రు.
ఘట: — మీయయ్య యిచ్చటనున్నాఁడా?
బభ్రు: — లేఁడు. ఊరికిఁబోయియున్నాఁడు.
ఇలా:— మాయయ్యను నీవు జూచినావా?
ఘట:— కుమారా! చూడలేదు. ఏయూరికిఁబోయియున్నాఁడు?
ఇలా:— నాకుఁ దెలియదు. నాయమ్మనడుగుము.
బభ్రు:— ఓయి! వీనియమ్మకును దెలియదు. నాయమ్మ నడుగుము
ఘట:— (స్వ) ఓహో! వీరిద్దఱు భిన్నోదరభ్రాతలైయున్నారు. (ప్ర) బాలకులారా! మీతల్లులెందున్నారు.
బభ్రు:— నీవు నాయమ్మయెడకుబోవకుము. నిన్నుఁజూచి భయఁపడును.
ఘట:— ఎందుకు?
బభ్రు:— నీవు బూచివి.
ఘట:— నీకు భయములేదా?
బభ్రు:— నేను బూచినిఁగాలఁదాచెదను.
ఇలా:— నేను బూచితోయుద్ధమాడెదను. ఇష్టమున్న నాతోఁబోరుము. రమ్మ (అని చెడ్డు తట్టును.)

పాట-(అనుబంధము-7)

ఘట:— (స్వ) ఈబాలుర వీరధరణీ వరకుమారులనుటకు సందేహము లేదు. అతఁడు మావిజయుఁడై యుండవచ్చును. అట్లయిన వీరు నాకుఁ దమ్ములైరి. అందువలననే వీరిని వీక్షించినప్పటినుండి నా నెమ్మదిని నెనరుదనరుచున్నది. (ప్ర) కుమారులారా మీరిద్దఱును రండు. (వారిని ప్రీతిచే నెత్తికొనును.)

[ప్రవేశము-ఉలూపి]

ఉలూ:— ఆహా! యెవ్వఁడో రక్కసుఁడు కుమారుల నెత్తుకొనిపోవనున్నాఁడు.-ఓరీ! నీవెవ్వఁడవురా? (ఖడ్గము నెత్తును.)
ఘట:— తల్లీ! నేను శత్రుఁడనుగాను.
ఉలూ:— అయిన నీవెవ్వఁడవు?

ఘట:— నేను పాండవేయుఁడగు భీమసేనుని పుత్రుఁడను.

ఉలూ:— (యోచించి) నీతల్లి హిడింబియా?

ఘట:— అవును.

ఉలూ:— ఘటోత్కచకుమారా! నిన్నుఁ జూడకున్నను నా నాథుఁడు, నీపినతండ్రి, నీధీరగుణంబులఁ బొగడుచు నుప్పొంగుచుండునది నేను గాంచినదానను. తనయా! నీకు శుభమగుగాక? నిన్నుఁగాంచుటచే నేఁడు మాకు సుదినము, కుమారులారా! ఈవీరశేఖరుఁడు మీకు నన్నగావలయును. నమస్కరింపుఁడు.

ఇలా-బభ్రు:— (నమస్కరింతురు.)

ఘట:— కేసరీ కిశోరము లిట్లుగాక మఱియెట్లుండును?

ఉ॥ పంతముచే విరోధికులపార్థివులేపునబంపు బాణముల్ ।
బంతులుగాగబట్టుకొను బాహుపరాక్రమ జృంభణంబులన్ ।
వింతగజూపి మానరుని వీరకుమారులునై వెలంగు ధీ ।
మంతులకున్ నితాంతబలమంగళదంతులకున్ శుభంబగున్॥

ఉలూ:— కుమారా! ఈయాకస్మికంబగు నీరాకకుఁ గారణమేమి?

ఘట:— నేను ఫల్గుణుని వెదకుచువచ్చినాఁడను. భూసంచారమునకు వెడలి చిరకాలమైనను నతఁడూరికి రాకుండుటచే, మావారు విచారచిత్తులైయున్నారు. మాతా! మీయట్టి మానవతులు సతులుగానోపునట్టి పుణ్యము మాపార్థునకెట్లులభించెను? నరుని చరిత మించుక వివరింప వేఁడువాఁడను.

ఉలూ:— తనయా! మావార్తనంతయు బిదప దెలిపెదను. నేను "ఉలూపి" యను నాగకాంతను. చిత్రవాహనునిపుత్రి చిత్రాంగదయు నేనును బార్థునకు భార్యలైతిమి. వినోదార్థముచిత్రాంగదను జూడ నేనరుదెంచితిని. యావల్లభుఁడు భూప్రదక్షిణము జేయుచున్నాఁడు. అతఁడిప్పుడెందుండునో విచారింతము గాని మామందిరమునకు రమ్ము. భోజనమునకు వేళైనది.

ఇలా-బభ్రు:— అన్నా! పోవుదము రమ్ము.

పాట-(అనుబంధము 8)

## ద్వితీయాంకము-ప్రథమరంగము.

ప్రభాసతీర్థము-అర్జునుఁడు-బ్రాహ్మణులు.

అందఱు:— (కృష్ణధ్యానము జేయుదురు.)

పాట- అనుబంధము-9

అర్జు:—

సీ॥ భూదేవులార మీ! పూతచారిత్రంబు-కాపాడెనాయాత్ర-గలఁతలేక ।
సుతునిరక్షించెడు-పితరునిబోలెనన్-గాచితిరిందాక గరుణతోడ ।
భూప్రదక్షిణమేను-పొలుపారనెఱవేర్చి-కృతకృత్యుఁడగుసట్టి-హితముగంటి ।
పావనులైనమీ-సేవనన్ గైకొని-ధరణిపై నేనెంతో-ధన్యుఁడైతి ॥
గీ॥ భాసురంబగుదివ్యప్ర-భాసతీర్థ ।
సేవనింపొందఁగా నేఁడు-సేయఁగల్గె ।
సరగ నేనింక ద్వారకా-పురము జేరు ।
పుణ్యమలకృష్ణుగృపచేత-బొసఁగఁగలదు॥

ధాత్రీసురోత్తములారా! నేను యాత్రకు బైలు వెడలినదాదిగ, ననువీడక వెంటనుండి తీర్థసేవాపుణ్యంబును, మనోభీష్టసిద్ధియును నాకు సంధించితిరి. నావారినిఁబాసి బహుకాలమైనది. నేనచిర కాలంబుననే, యీభూసంచారంబును సమాప్తిగావించి, యింద్రప్రస్థమున కరిగెదను. ఈప్రభాసతీర్థమునకు ద్వారక చేరువగ నున్నదికద? మీరూరికి విచ్చేయుఁడు. నేను ద్వారకకరిగి శ్రీ కృష్ణుని సందర్శించి వచ్చెదను.

విష్ణుపాద:— ఫల్గుణా! నీవెంటవచ్చిన పరివారమంతయు గోకర్ణమునుండియే మరలిపోయిరి. మేముమాత్రము నిలచియున్నారము. మీసంచార పరిపూర్తియగువఱకు మేమును లేకున్న నీకుఁ దోడెవ్వరున్నారు?

[ప్రవేశము-ఘటోత్కచ.]

ఘట:— నేనున్నాఁడను. పితృవ్యా! నమస్కృతులు.

అర్జు:— ఘటోత్కచ కుమారా! నీకు స్వాగతము. ఇదేమి నీ వింతరాక?

ఘట:— పితృవ్యా! నీవు యాత్ర వెడలి, నీయాత్మ భంధువులను మఱచి, ద్వారిక నీవార్త తెలుపక, వారిక్షేమము నీవు విచారింపక, చిరకాలము సంచరించు నీపోకవింతగుగాని, యీనారాక వింతగునా?

అర్జు:—కుమారా! ఇది నాప్రారబ్ధము. పాంచాలివిషయమై మేము నియమించుకొన్న సమయభంగము నేనొనరించిన దానికై, యీవిషఫలముల ననుభవించుచున్నాను.

విష్ణు:— పార్థా! పాపము. ఎన్ని విషఫలముల ననుభవించితివి? ఉలూపిదేవినిఁ బెండ్లాడుట మొదటి విషఫలము. చిత్రాంగదను పరిణయించుట రెండవ విషఫలము. ఇంక త్రిశుద్ధికానిదే నీవిల్లు జేరవు. ఇట్టి విషఫలములుదొరుకు యాత్రలు బహుప్రయాసము గదా?

అర్జు:— తనయా! ఈవిప్రపుంగవులను మనయూరికి నతిత్వరితగతిఁ బనిపి నాసోదరులకు నావార్త నెఱింగింతము. మనము ద్వారకనుఁజూచి మరలుదము. ఆర్యులారా! ఇంక విచారమేల? నాకుఁ దోడే భీమపుత్రుఁడున్నాఁడు. మీరు తడయక విచ్చేయుఁడు.

బ్రాహ్మ:— ఇంక మాకు యోచనలేదు. వెడలెదము.

అర్జు:— ఆర్యులకు నమస్కృతులు.

బ్రాహ్మ:— శుభమస్తు.

(పోవుదురు.)

అర్జు:— వాయుపౌత్రా! నీమాటలవలన మావారు నిన్ను బంపినారని తెలిసితిని. నాకు భూప్రదక్షిణాభిలాష మెండుగనుండెను. సమయ మొదవినందున నిష్ట పూర్తిగావించుకొను చున్నాను. ద్వారకఁజూచిన నాతనివిదీఱును.

ఘటో:— అయిన జాగేల? ఆయింత కొంతదీఱ నేఁడే యావీడు జేరుదము.

అర్జు:— అట్లనే కానిమ్ము.

[ప్రవేశము—నారద.]

నారద:— పాట-(అనుబంధము 10)

అర్జు:— ఓహో! సురమునులవారు స్వారి వేంచేసిరి.

(ఇద్దఱు నమస్కరింతురు.)

నార:— కల్యాణమస్తు-కూర్చుండుము. అర్జునా! ఇంద్రప్రస్థముబాసి యేల నిచ్చటనున్నాఁడవు?

అర్జు:— మునీంద్రా! ఇదియంతయు మీప్రసాదమే.

నార:— ఓహో! నీవు సమయము నతిక్రమించినది, నాప్రసాదమా? అయినను కాని-ఇంకనైన నీతిరుగుట మాని యూరు జేరుము.

అర్జు:— యతీంద్రా! ఇంకొకకార్యము శేషించియున్నది. దానిని ముగించి మీయాజ్ఞ జరిపెదను.

నార:— ఏది యాఘనకార్యము?

అర్జు:— ద్వారకకుఁబోయి, బలరామ కృష్ణులదర్శించి ముదమునెల కొనుచెలిమినిగూర్చు పూజలు జేతును.

నారద:— ఏమంటివి? చెలిమినిగూర్చు పూజలా? చెలియలిని గూర్చు పూజలనుకొంటిని నేను.

ఘట:—మునీంద్రా! మీరన్నట్లే యేలగారాదు? అందునదప్పేమి?

నార:— ఏమిది? భీమనందనా! కృష్ణసోదరి సుభద్రకు రెండు పెండ్లిండ్లు గావలయునా?

అర్జు:— ఆహా! సుభద్రకుఁ బెండ్లయినదా?

నార:— అయినట్లె. అంతయు నిర్ధారమైనది. పెండ్లికార్య సంబరములు సాగియున్నవి.

అర్జు:— వరుఁడెవ్వఁడు?

నార:— ఇంకెవ్వరుందురు? రాజరాజగు సుయోధనుఁడు.

ఘట:— మునివర్యా! ఈమాట నిక్కమా? ఈనిశ్చితమెవ్వరు చేసిరి? చిఱుతనాటనుండి, సుభద్రను బార్థునకిత్తుమని యాదవ పెద్దలు నిర్ధరించియుండలేదా?

నార:— పెద్దలకుఁ బెద్దబలరాముఁడు కౌరవ పక్షపాతియు గలిగి యుండ, మాయావి శకుని బూటకములు సాటిలేనివై యుండ, నార్యుల మాటలెట్లుసాగును?

అర్జు:— కృష్ణుఁడిందునకు సమ్మతించెనా?

నార:—చేయునదిలేక యూరకుండిన, సమ్మతించినట్లే.

అర్జు:— ఆహా! నేనెట్టి భ్రాంతుఁడనై యుంటిని? ఆగదుఁడు తానె ఘూపురి కరుదెంచి, యాయరవిందనయన రూపలావణ్యంబుల వర్ణించి దేవకీవసుదేవుల నిశ్చయంబు నాకెఱిగించి, నా మన ము నాఘనవేణికి నలవరింపజేసి, వెడలిపోయెనే, ఇప్పుడీ విపరీ తమెట్లాయెను?

ఘట:—పినతండ్రీ! నీమానసము వరించిన మందయానను సుయో ధన మందభాగ్యుఁడు బొందనిచ్చిన నేను భీమనందనుఁడగు దునా? మునీంద్రా! చెప్పుము. వివాహమునకు నేదినము నేర్ప రచియున్నారు?

నార:— లగ్నపత్రిక జూచిన నంతయు దెలియవచ్చును. ఆపత్రి కను దీసుకొని ద్వారకనుండి భూసురులు వెడలియున్నారు. వారీదారిగనే యింతలోననే పోగలరు, నాకు వేళాయెను.

(నిష్క్రమించును.)

[ప్రవేశము—చారుదత్త—దేవదత్త.]

చారు:— దేవదత్తా! ఇదియేనా ప్రభాసతీర్థము?

దేవ:— అవును.

చారు:—ఈచోట నించుక విశ్రమింతము.

ఘట:— పితృవ్యా; ఆభూసురులు వచ్చుచున్నారు. నీవు మఱుగు నకు బొమ్ము.

అర్జు:— నీవేమి చేయఁదలంచితివి?

ఘట:—చెప్ప నవకాశము లేదు—నీవు పొమ్ము.

అర్జు:— (పోవును.)

చారు-దేవ:— (వచ్చి కూర్చొని)

చారు:— దేవదత్తా! యీపదునైదు దినములు ద్వారకలో నీగృహంబున నన్నుంచుకొని తద్దయు నాదరము నొనరించి నన్ను బ్రేమించితివి. ఇందుచే హస్తినాపురికిఁ బోవలెనన్న నామనసు నన్ను వెనుకకు నీడ్చుచున్నది.

దేవ:— నాకాళ్ళుగూడ నన్ను వెనుకకీడ్చుచున్నవి, ముందు మన పయనము సాగుటనాకేమో యనుమానముగనున్నది.

చారు:— అదేల?

దేవ:— బలరాముఁడు లగ్నపత్రిక వ్రాయింపనారంభింపగనే పొరుగింట నెవ్వరోవచ్చిరని శంఖము మ్రోయింప నారంభించిరి. ఆపత్రికను నాచేతికిచ్చు నప్పుడెవ్వరో "ఛీ" యని తుమ్మిరి. మనము పత్రికను బుచ్చుకొని ప్రయాణమై తలవాకిలి బయటికి బాదము బెట్టినంతటనే మార్జాల చక్రవర్తుల వారెదురుగ వచ్చిరి సరియైనదారి బట్టి నడచుచుండ ఘోరసర్ప మెదురైనందున, నడ్డత్రోవ బడి యిచ్చటికి వచ్చితిమి. ఇన్ని మంచి శకునములు గలిగినందున మనప్రయాణము కొనసాగునా?

ఘట:— (వెనుకనుండి) సాగదు. సాగదు.

దేవ:— (లేచి దిక్కులఁజూచి యెవరినిఁగానక) ఎవ్వరులేనట్టి యరణ్యమున శకునములకు సహాయముగ నాకాశవాణియు పశ్చృతినుడివినది. ఈశుభశకునములు పరిసమాప్తి కావలయునన్న నింకొక్కటియే తక్కువ.

చారు:— అదియేది?

దేవ:— దుర్యోధనుని పెండ్లికి ముందుగానెవరైన మనపెండ్లిచేసి యీప్రతికతోపాటు సొత్తులన్నియు నెత్తుకొనిపోవుటయే తక్కువ.

ఘట:— అదియునగును,

చారు-దేవ:— (బెదరి దిక్కులు జూతురు)

ఘట:—(ప్రవేశించి) పంచచామరము.

వనంబుజొచ్చిపాఱులార-ప్రజ్ఞలేనిభంగిగా।
మనంబులోనభీతిలేక-మందలించువారుగా?।
ఘనంబుదోచు మీదుదుండ-గంబ్రపేలుచుండినన్।
మనంగనియ్యమిమ్మునిక-మ్రిందద్రొక్కినై చెడన్॥

(మీనేరంబు ఘోరమాయెగా-మీరుజాలరింకనన్ను-మీరిపోవగా)

(దేవదత్తుని బట్టుకొని యల్లాడించి) బ్రాహ్మణా! తెమ్మలగ్న పత్రిక.

దేవ:— అయ్యో? దయ్యమా! నన్ను మ్రింగకుము.

ఘట:— నీవు కోరినపెండ్లిజేతునా లేక పత్రికనిత్తువా?

దేవ:— వలదు-వలదు. ఇచ్చెదను (పత్రికఁ బాఱవేయును)

ఘట:—(పత్రికబుచ్చుకొని) బ్రాహ్మణులారా! ఈపత్రికకై మీకు దుర్యోధనుఁ డిచ్చుచుండిన బహుమతి నేనే యిచ్చెదనురండు.

దేవ:—వలదు-వలదు. మమ్ముప్రాణములతో విడిచిననదియే గొప్ప సంభావన. భూతరాజా! నీకు నమస్కారము. మాకు ప్రాణ దానము నిమ్ము. (సాష్టాంగముగ మ్రొక్కుదురు.)

ఘట:—బ్రాహ్మణులారా! లెండు. భయపడకుఁడు. మీకు సేమం బగును నావెంటరండు.

దేవ: — నీవెవరవు?

ఘట:— నోరు మూసికొని యూరక వచ్చెదరాలేదా?

దేవ-చారు:— వచ్చెదము-వచ్చెదము.

(అందఱు నిష్క్రమింతురు.)

(పునఃప్రవేశము-ఘటోత్కచ,)

ఘట:—(చేత లగ్నపత్రిక నిడుకొని) హలధరుఁడు వ్రాయించిన లగ్నపత్రిక నాచేతికిఁజిక్కినది. ఆభూసురులు సమాధానచిత్తులై సంతోషమున, నేను జెప్పినట్లు వినుచున్నారు. విజయుఁడు నారదునితోనాడిన మనోవ్యాకుల సూచకంబులగు వాక్కుల ను విన్నవెంటనే యాకౌరవనీచుఁడు సుభద్రాకీరవాణిని జేపట్ట నియ్యనని నేను బ్రతినబూనితిని. నాపట్టును సాధించునట్టి సాధనములన్నియు సమకూర్పకుండిన నేను భగ్నప్రయత్నుఁడ నగు

టయేకాక, నాపినతండ్రికిఁ బెనువనటయొనగూడును. నేను జేయ బూనిన యుపాయములను ధనంజయునకు నివేదించుట యనుచి తము. అతఁడుల్లమున నెంతగ నల్లటపడుచున్నను వెల్లడిగ నాకు ననుమతి నివ్వజాలఁడు. బలరాముఁడొకఁడు దప్ప యాదవశ్రేష్ఠు లందఱు సుభద్రాకన్యను బార్థునకొసఁగు ప్రీతిగలిగి యున్నా రని యాదేవదత్తుఁడు చెప్పెను. విజయుఁడన్ననో, తనచిత్తమా మత్తేభయానకాయత్తమైనదని నారదునితో నోటినిండ నుడి వెను. ద్వారకకు జనుదెంచుకోరికకూడ నాకోకలవాణికొఱకే కాని వేఱుకాదు. వెయ్యిబొంకులు బొంకియైనను నెట్టి యుపా యమునన్నియైన నొకపెండ్లి జేయుట శాస్త్రసమ్మతము. కావున సుభద్రార్జునుల బరిణయంబునకై నానాటకమును బ్రారంభిం చెదను.

[ప్రవేశము-అర్జునుఁడు.]

అర్జు:— ఘటోత్కచకుమారా! ఆబ్రాహ్మణులనేల నిర్బంధించి యున్నాఁడవు? ఆర్యుల నవమానపఱచి యలయింపకుము. వా రిని బంపుము.

ఘట:— పితృవ్యా! ఆవిప్రులిచటినుండి పొమ్మన్నను పోవమనసు రాని సౌఖ్యసంతోషములు వారికిఁగలిగియున్నది. నీవు యోచిం పకుము. లగ్నపత్రికను జదివితిని. రాబోవు మార్గశీర్ష శుద్ధ సప్త మినాటికి లగ్నమిడియున్నారు. ఇచ్చటి కయిదుమాసములవధి యున్నది. ఆదినముననే దుర్యోధనునకు మారుగ నీవుసుభద్రను బరిణయింపగలవు.

అర్జు:— కుమారా! ఇంకెక్కడి సుభద్రయాసనాకు? యజమానుఁ డగు బలరాముఁడు వాగ్దానమొసంగి లగ్నమునిశ్చయించి, శుభ పత్రికనుబంపియుండ నింకను నీకుభ్రాంతివదలదే?

ఘట:— ఆలగ్నపత్రిక సుయోధనుని జేతికి జేరనిమ్ము.

అర్జు:— ఆ పత్రికను బ్రాహ్మణులకొసఁగి వారిని బంపెదవా లేదా?

ఘట:— నాకేల నాపత్రిక? ఆవిప్రులు దమయిచ్చవచ్చినప్పుడు తర లిపోవచ్చును. నాయవరోధమేమియు లేదు.

అర్జు:— అట్లయినసరి. కుమారా! ఈప్రభాసతీర్థమున, నేనింక కొన్నిదినములుండి, యింకను గొంత భూసంచారమొనర్ప నభిలషించియున్నాఁడను. నీవిందరి ప్రస్థమున కరిగి నాక్షేమము మనవారికిఁ దెలిపి నీవు నీవనంబునకు బొమ్ము.

ఘట:— నేఁడు ద్వారకకు బోవుదమంటివే?

అర్జు:— పర్యాలోచన సేయుటలో ద్వారకా ప్రయాణము సంక్షేపించితిని.

ఘట:— పితృవ్యా! ఏలదాచెదవు? నీడెందములోని గొందలము దెలియకుండునంతటి మందబుద్ధినా నేను? శ్రీకృష్ణుని జెల్లెలిని వలచిన ఫల్గుణునికోర్కె వ్యర్థమగునా? ఏలయోచించెదవు?

అర్జు:— కుమారా! ఎంతదాచినను నాసంచలనము నిమ్మళింపకున్నది నాకు నొసంగనెంచిన చంచలాక్షిని నాపగతుఁడు బరిగ్రహించునుకదా యను వైరస్యము చలమునెసగించి నాకు విరక్తి బుట్టించియున్నవి. ఆకన్యకామణి నన్నుఁ జేపట్టకున్నచో నేను సన్యాసినై కృమ్మరుచుందును

ఘట:— ఇంద్రనందనా! నీచందము నెఱుంగక లేని సందేహంబులఁ బొంది యలందురుదువేల? ఇందుకు నేనేమందును? సర్వవేత్తవగు నీకు నుద్బోధించునట్టి శక్తి నాకుగలదా? అయిన నీవిప్పుడు మైమఱచి యుండుటచేత నాకు దోచినతీరు వాకుచ్చకున్న దీఱదు. ప్రపంచమున వివాహములు నెగడించుట దంపతుల యొక్క భవిష్యత్సంతోషముననకే కాని వినోదమునకు గాదు కదా?

సీ॥ అతివకుబతిసౌఖ్య-మలరంగవలెనన్న-మదినిసుస్థిరప్రేమ-యొదవవలయు।
ప్రేమబంధనదీప్తి-వెలయంగవలెనన్న-వరునితో భాషించివలవ వలయు।
యుక్తభాషణశక్తి-యొనగూడవలెనన్న-యువతివిద్యను నేర్చి-యుండవలయు।
వరవిద్యపాలఁతుక-పారయంగవలెనన్న-పటిమమైప్రాయంబు-బడయవలయు॥

గీ॥ పిన్నతనమునబితరులఁ-బ్రీతికొలఁది ।
వరుఁడితఁడువధువిదియని-వరుసలిడుచు ।
బ్రేమయెఱుఁగనిబొమ్మల-బెండ్లిసేయు ।
పాపచిత్తులుదుగకాళ్ళ-పసులుగారె? ॥

పిత్రృవ్యా! నీవు సుభద్రనుఁజూడలేదు. ఆతరుణి నిన్నుఁజిలకింపలేదు. ఆమరాళయానపై నీవు విరాళిజెందినట్లె యాబాలకు నీపై బాళి గలదని తెలియునా? ఆసుదతి సుయోధనుని వలవలేదని యెఱుంగుదువా? ఈవార్తనరయక యూరకతల్లడముజెందుట గోలతనముగాదా?

అరు:—నీమాట నిక్కము. నీయొక్క హితాలాపములు నాబేలతనమునుఁబాపెను. సుభద్రయొక్క మనోభావము వేరుగానుండెనేని చింతయే తీరినది. అటుగాక నాయింతి సమ్మతింపని బలవంతపు పెండ్లిని బలభద్రుఁడు తలపెట్టియున్ననెట్లు?

ఘట:— అందునకే, ద్వారకకుబోవుదము రమ్ము. సమయమరసి యాకుసుమాంగినిగాంచి భాషింపుము.

అరు:— తనయా! ఇది నావలనఁగానిపని. ద్వారకయందంతయు, సుభద్రా సుయోధనుల పెండ్లి నెగడబోవువార్తానది ప్రవహించుచుండ నేనుబోయి, పరిహాసమునకు గురిగావలెనా? బలరామకృష్ణులకు మోముఁజూపఁగలనా? ఆభాసురాంగితో భాషింపగలనా?

ఘట:— అట్లయిన నిజమరయుటెట్లు?

అర్జు:—నాకుఁదెలియదు. నీవే యేమైన నొనరింపుము.

ఘట:—(యోచించి) అట్లయిన నాయోచనకొలఁది కలతీరు విచారించి వచ్చెదను. సుభద్రకు దుర్యోధనునిఁ బెండ్లియాడు సమ్మతిలేకున్న నాదుష్ట కౌరవునకు పరిభవమునొనర్చు కార్యమునకు నీయనుమతి నియ్యవలెను.

అర్జు:—నీవేమొనరించినను నాకు సమాధానమే.

ఘట:—అయిన నీవు నుడివినరీతిగ, నేటినుండి నీవు సన్యాసివేషముననే యీప్రదేశమున చరించుచుండుము. నేనుబోయెదను.

(యవనికజారును)

---

## ద్వితీయాంకము-తృతీయరంగము

### ద్వారక: అంతఃపురము

సుభద్ర:— (పడకపైన పరుండియుండును)
మాధవి:— (సుభద్రకుఁగాలి వేయుచుండును)
సుభద్ర:— పాట (అనుబంధము 11)

(ఊపిరివిడచి) అన్నా! బలరామా! చిన్ననాఁటినుండి నిండు ప్రేమ నెరపిగోమునఁబెంచిన నీవేనా సేమమునరయవైతివే! ఆ దుర్యోధనుఁడు రాజ రాజగుటచేత నాహృదయ కమలము నకు శాత్రవుఁడగునని నుడివితినే? వాఁడు కురువీరుఁడైన నాకు రవుకాఁడని నుడివితినే? నేనుప్రేమింపని వానిని నాకు నాథునిగఁ జేయుటకన్న నన్ను నూతఁదోయుట పూతమని మొఱయిడితినే? నీచరణములపైఁబడి చెఱఁగునొడ్డి వేఁడినను నీకుఁగరుణ రాక పోయెనే? చిఱుతనాఁటినుండి, పార్థునిఁబ్రేమించి లోలోన నం కురించి పెరిగి ఫలభరితమైయున్న నామోహ వృక్షమును నొక్క ప్రేటునకు నరికివేయ నీతరమగునా? ధనంజయుని వరిం చియున్న నామానసమన్యుఁ డెట్టివాఁడైనను పాటించునా? పార్థుఁడుగాని యితరుఁడు బ్రతికియున్న సుభద్రయొక్క పాణినిఁ బట్టఁగలఁడా? కృష్ణా! బలరాముఁడెగరినట్లంతయు నీవు మారుఁ బలుకక నూరకున్నాఁడవే? ఎన్నియో మారులు నామనోనా థుఁడగువాఁడు నీయనుంగు ధనంజయుండేయని నాతోడఁ బల్కి నాయూర్మిమాన్పి కూర్మినెలకొల్పితివే? ఇట్టిసంతాప మున వందురుచున్న నీసోదరినించుకైన నాదరింపక నున్నాఁ డవే? ఇంకనాగతియేమి? ఎవ్వరితోఁజెప్పుకొందును? ఏచోటు నకుఁబోవుదును? నాకుఁబంధువులెవరు? మిత్రులెవరు? దిక్కె వ్వరు? హాఁదైవమా!

(అనుబంధము-12)

(పాడి మూర్ఛిల్లును)

మాధవి:— అమ్మా! నిమ్మళింపుము-(అని చేరఁబోయి) ఈకోమలి మూర్ఛిల్లియున్నది-నేను వెడలిపోయి రేవతీదేవినిఁ బిలుతమన్న నిచ్చట నెవ్వరునులేరే?

ప్రవేశము-భద్రా.

భద్ర:— ఏమేమాధవీ! సుభద్ర యెట్లున్నదే?

మాధవి:— అమ్మా! భద్రాదేవీ! ఈకాంత సంతాపము చెప్పనలవికాదు- మూఁడుదినములనుండి కమలిన కుసుమమైయున్నది- ఇప్పు డేమేమో కలువరించి సొమ్మసిల్లియున్నది.

భద్ర:— (సుభద్రను నిరీక్షించి) మాధవీ! మగవా రెంత బుద్ధిమాంద్యులే? సుయోధనుని, నేనొల్లనని యీపల్లవాధర రేవతీవల్లభునితోడ నెంతగోడుగఁజెప్పి యేడ్చిన నా బలరాముఁడు తన జడ్డుఁదనము విడువఁడాయెను - ఆదుర్యోధనునితోఁగాపురముఁ జేయునది తనచెల్లెలా లేక తానా?

మాధవి:— ఏమోయమ్మా-ఆపలుగాకిశాకి నీభూతమునకుఁబుట్టిన శకునియను కాకిముక్కు వాఁడుమాయింటఁ గాలుపెట్టిన దాదిగఁసుభద్రకుఁభూతము సోఁకియున్నది. ఈమె గతి యేమగునో దేవుడే యెఱుఁగును.

సుభ:— (దిగ్గున లేచికలువరంబునఁగోపముతో) అన్నా! నీవేవానినిఁబెండ్లియాడుము. నానాథుఁడు గంగలోనున్నాఁడు. నేను పోయెదను.

(అని లేవఁబోయిగూలఁబడును.)

భద్రా:— సుభద్రా! ఊరడిల్లుము (అని గాలివిసరి) మాధవీ! నీవు లోనికిఁబోయి రేవతీరుక్మిణులకు సుభద్రయొక్క స్థితినిఁదెలిపి రమ్ము

మాధవి:— (పోవును)

భద్రా:— సుభద్రా! సుభద్రా! కొంచెముకన్నులు దెఱవుము. మాటలాడుము.

[ప్రవేశము రేవతి-రుక్మిణి-మాధవి.]

సుభ:— (లేచి తాపమున) కృష్ణారమ్మా. ఈబలరాముఁడు నాకుత్తుకకు నురిత్రాడు బిగించియున్నాఁడు. రక్షింపుము. రక్షింపుము. రేవతీదేవీ! నీకాళ్ళ కెరఁగెదను. కావుము. రుక్మిణీదేవీ!

నీవైననాకుఁబ్రాణదానమిమ్ము. బలరామా! నీవునాకన్ననా? కిరాతుఁడవు. అక్కటికములేని కటికవాఁడవు. ఈమంగళసూత్రము నీవేకట్టుకొనుము (గొంతులోని దండ(దెంచివేయును).

భద్ర:— (సుభద్రను బట్టుకొని) సుభద్రా! ఇదేటి కలవరమే? అందఱు భీతులైయున్నారు?

రేవతి:— మాధవీ! నీవు పోయినానాథునిఁదోడిదెమ్ము.

మాధవి:— (పోవును)

సుభ:— (భద్రను కౌగలించుకొని) పార్థా! నీవునాకుఁబ్రాణదాతవు. నాప్రాణనాథుఁడవు (మ్రొక్కి) నీవురాకున్న నాగతియేమగుచుండెనో? అయ్యో! నాయన్నవచ్చుచున్నాఁడు. నిన్నేమిచేయునో? నన్నువిడువకుము (మూర్ఛ)

రుక్మి:— అక్క రేవతీ! బావగారుచేసిన హోవడిలో మన సుభద్ర దక్కునట్లులేదు.

రేవతి:— నేనేమి నెత్తినిఁబగలగొట్టుకొందునా? ఎంతచెప్పినను వినలేదు.

[ప్రవేశము బలరాముడు]

బల:— రేవతీ! సుభద్రకేమైనది?

రేవ:— దేవకీ వసుదేవుల పలుకులు సరకుసేయక నీవె పెద్దఱికము గట్టుకొనిచేసిన బుద్ధిజాడ్యపు పనికి నీముద్దుచెల్లెలి ప్రాణాపాయభీతియెల్లరకుఁ బాటిల్లియున్నది.

బల:— వెఱ్ఱిదానా! ఊరక(పేలకుము (సుభద్రను సమీపించి) సుభద్రా! (అనిపిలుచును.)

సుభ:— (పలుకదు)

బల:— మాధవీ! రాజవైద్యుని బిలువ సేవకునిబంపుము-భద్రా! వైద్యుఁడు వచ్చువఱకు నీవుచెల్లెలి యొద్దనేయుండుము. ఇచ్చట సందడికలుగకుండ తలుపులుమూయుము. రేవతీ! నీవిందుండ దగవు పోదమురమ్ము

రేవ-బల:— (ముందటికివచ్చెదరు)

బల:— రేవతీ! అందఱియెదుట నామానము దీయుచున్నావే నేనేమి చేయరానిపని జేసితిని?

రేవ:— ఆచిన్నదానికి మనసురాని మగనిని గొంతునకుఁగట్టునంత పంతమువిూకేల? అదియేమి ముగ్ధయా? యుక్తాయుక్తపరిజ్ఞానముగల యువతికాదా? అదివలదన్న పతిని బలవంతముగ వరింపజేసిన, దానికి సుఖముకలుగునా? మనకందఱికి క్షేమమగునా?

బల:— నేను మిగులయోచించి యీబాలికకు సౌఖ్యము గలుగు చోటునకు నియ్యనిశ్చయించినాఁడను. దుర్యోధనునకు నేమిట దక్కువయున్నది? విచారించిన విజయునకు నైశ్వర్యమేమి యున్నది?

రేవ)— నీమైశ్వర్యముపైన బెద్దబండపడని. స్త్రీవరింప వలసినది మగనినా లేక భాగ్యమునా?

బల:—నీకేలనే యీపెత్తనము? స్త్రీలగువారు మగవారికార్యములలోఁబ్రవేసింపరాదు. మీమాటలువిన్న మామత్యాదలు నిలుచునా? మన సుభద్రకు దగువరుఁడు సుయోధనుఁడే కాని, యితరుఁగాఁడు.

రేవ:— ఇది మగవారందఱి తాత్పర్యమా లేక మీయొక్కరిదేనా

బల:— ఒకరి సంగతి నాకెందుకు? నేను గన్నవారి యభిప్రాయమునడుగునంతటి యవివేకినిగాను.

రేవ:— మీదమ్ముని నైన నడిగితిరా లేద?

బల:— అడిగితిని. అతఁడేమియుననక నూరకుండెను.

రేవ:— దుర్యోధనునకు సుభద్ర నియ్యవచ్చునని యొక మాటయిన ననెనా?

బల:— అనలేదు. అనకున్న నేమి?

రేవ:— ఇంక మీయెగురులాటలు, పెండ్లిసంబరములు నన్నియు గట్టిపెట్టి లగ్నపత్రిక పంపినది తప్పాయెనని చెంపలు వాయించుకొని, దుర్యోధనునకు క్షమాపణపత్రికబంపి, మర్యాదదక్కవలెనన్న వేఱువిచారముమాని, యర్జునునకు గన్యనిచ్చి పెండ్లి చేయుఁడు.

బల:— రేవతీ! ఎంతయజ్ఞానురాలవే?

రేవ:— నీవు జ్ఞానవంతుఁడవైన నీతమ్మునితో "అస్తు" యనిపించుకొని సుభద్రకు పెండ్లిజేయుఁడు. లేకున్న మీమానము మగవారిలోను, నామాన మాఁడవారిలోను దక్కదు.

బల:— నేను తలపెట్టినది మానను. యాదవకులమంతయు నొక్కటైనను నేను వదలను.

రేవ:— నేను ఫల్గుణు బిచ్చి చెప్పెదను. ఈపెండ్లి కాదు. కాదు.

పాట ఇద్దఱిది. (అనుబంధము 13) (పోదురు)

[ప్రవేశము-సుభద్ర-భద్ర.]

సుభ:— అక్కా! నాయాసవిడువుము. అమరనాథ కుమారుని, వరమోహనాకారుని, లోకవిదితశూరుని, రూపజితమారుని, సరసనుగుణవిహారుని, నరుని, నేపతిగవరింతునని, యెంతో నమ్మియుంటిని. నాయంతరంగ తరంగిణిలో బొంగారుచుండిన యానంద తరంగములు, రంగాతిభంగురములాయెనే. ఈఘోరపరితాపము నెట్లుభరింతును? భద్రా! నేనేమిచేతును?

సీ|| ఏడక్కనకుజన్న-నేమి చేయుచునున్న-పార్థుని ధ్యానంబు- బాయజాల|
పూజింపగడఁగినఁ-భుజియింపదొడఁగినఁ-విజయునిదలఁపు నే-విడువజాల|
ఆటకైతమిలేదు-పాటకైమఁదపోదు-తెలవ! నాగతియేమొ-తెలియలేదు|
మఱచితిసుఖమెల్ల-బఱచితిభయమెల్ల-నరునిపైస్మరణంబు-తరపలేనె||
గీ|| అన్న నాతగులముగన-కున్నవాఁడె|
ఎంతవేఁడిననాసుఖ-మెంచలేఁడె|
నీరజాక్షుండుపిలచినఁ-జేరరాఁడె|
ఇంతి! నా బాధదీర్చువాఁ-డెవఁడులేఁడె?||

పాట-ఇద్దఱిది (అనుబంధము 14)

భద్ర:—సుభద్రా! నీవు విద్యనేర్వనిపందవుగావు. ఈధరణిని మెఱయుచున్న ధీరభామినుల చరితములు జదివియును నట్టివారినిఁ జూచియు నున్నదానవు. దూరమేల? నీయింటిలోననే నీయెదుటనే యుండునట్టి రుక్మిణీ సత్యభామలు చాలరా? కావున ధైర్యముబూనుము. మనముకోరని పురుషులకుగట్టి వైవమనమేమి పసులమా?

మ॥ చెలియా! నీమనసారఁ గోరినపతిన్ - జేపట్టు నిర్బంధమున్।
సలుపన్ జాలఁడు రాముఁ డెందు; విడుమా సందేహసంతాపముల్।
నెలతా! స్త్రీ యననాకు మేయు యజమా - మేషంబుతోఁ బోలఁగన్।
బలరాముం డికఁ గాంచు నీదుబలమున్ - బాలామణీ! తాళుమా॥

మనకు మనసు రానప్పుడు నిర్బంధించు పెద్దలపాటెంత? వారినెదిరించియైనను బెదరించియైనను వంచించియైనను మనపట్టు సాధించుకొనజాలమా? బలరాముఁడు జేయఁదలఁచిన పెండ్లికింకను నయిదుమాసములవధియున్నది. నీమనోవాంఛ నొనఁగూర్చుకొనుట కవకాశము మిక్కుటముగనున్నది. నీకు వలసిన సహాయ్యము నొనర్ప నేను సిద్ధురాలనై యున్నదానను. యోచింపకుము.

సుభ:— భద్రా! ఈసంకటసమయమున నాకు దల్లియు దండ్రియు నాప్తమిత్రివు, ప్రాణదాతవు నీవె యైతివి. ఇపుడు నాయుల్లమున ధైర్య సంతోషములను నీవు చొరఁజేసినందునకై యెన్నిజన్మము లెత్తినను నీఋణము నేదీర్పజాలను. బలరాముఁ డగ్రజుఁడే, పూజనీయుఁడే, నేనెట్లెదిరింపగలనని యదరుచుంటిని.

భద్రా:— మనరుక్మిణికి నారుక్మిరాజన్న కాఁడా? అతఁడామెను శిశుపాలునకిచ్చి నిర్బంధముగ బెండ్లిజేయను సిద్ధుఁడై యుండినప్పుడు రుక్మిణి తనయన్న కవమానముకలుగులాగున మనకృష్ణుని రాక్షసవివాహంబున బరిణయింపలేదా? ఇందున నీకుఁ దెలియనిదేమున్నది?

సుభ:— అక్కా! మనరుక్మిణికి ధీయుతుఁడగు బ్రాహ్మణుఁ డొకఁడు సహాయుఁడాయెను. అట్టివాఁడు మనకున్నాఁడా?

భద్రా:— సుభద్రా! ఈయల్ప కార్యమునకు బ్రాహ్మణుఁడేల? పురుషుఁడేల? నేను చాలుదును. నీసుఖమునకై నాప్రాణము లర్పింప సిద్ధముగ నున్నదానను.

పాట (అనుబంధము 15)

సుభ:— భద్రా! నాసంతాపము తిలకింపజాలక నీవిట్లాడెదవు. పురుషు లొనర్పుటకైనను కష్టతరమగు గార్యము కదా యిది? నాకుఁదోడుపడబూనుకొని నీవు కీడునొందిన నేనెట్లు సైరింతును ఎంతటి యపకీర్తి కలుగును?

భద్రి:— చెల్లెలా! నాకై యోచింపకుము. విజయుఁడు ప్రభాసతీర్థమున నున్నాఁడని తెలియవచ్చినదికదా? కడుదూరముగాదుకద! అపజయమగునట్టి సాహసము నేనొనర్చుదాననుగాను. భీతిల్లకుము. ప్రాఁతనకు నీమోహాప్రీతిఁ దెలుపు పత్రిక వ్రాసియుంచుము. నేను మరలవచ్చి దానినిగొనిపోయి కార్యము సాధించెదను? (ఆలకించి) రేవతీ రుక్మిణులు వచ్చునట్లున్నది నేనుబోయెదను. (లేచి పోవుచుండ)

[ప్రవేశము-రేవతి.]

రేవ:— భద్రా? నీచెల్లెలెట్లున్నది?

భద్రి:— నెమ్మదినున్నది.

రేవ:— అట్లయిన నీవేలబోయెదవు? నీవు చెంతనుండినందున నీకొమ్మ నిమ్మళించియున్నది. నీవుపోయిన మరలనేమగునో? నేఁడు మాయింటనే భుజింపుము.

సుభద్రి:— వదినా! భద్రిను బోనిమ్ము. నాకేమియు భయము లేదు.

భద్రి:— (పోవును.)

రేవ:— సుభద్రా! నీనోటనిట్టి సమాధానవచనములు పలికినది, మాదెంతపుణ్యము? ఇంటివారందఱు నీపరితాపముగాంచి యంగలార్చుచుండిరి.

[ప్రవేశము-బలరాముఁడు.]

బల:— సుభద్రా! నీతాపమించుక శాంతమొందియున్నదా?

సుభ:— నాకేమి తెలుసును? వైద్యునియడుగుము.

బల:— చెలియలా! నాపైననింత విసుగేల?

సుభ:— అన్నా! నాకెట్లయిననుండని. నీకు మిగుల కూర్మిగల కౌరవ సార్వభౌమునకు ననుదగులగట్టుచుండ నేను సంతసింతునుకాని విసుగుగాంతునా?

బల:— సుభద్రా! నీవు చిన్నదానవు. మంచిచెడ్డల నెన్నజాలవు. ముందు సుఖమగునని యెఱుఁగనిగోలవు. ఇప్పుడు నీవెంతసంతాపపడియెదవో యంతకు నూఱంతలు సంతోషము నీకుగలు

గును. చింతిలకుము. రేవతీ! ఈబాలనూరక నలయింపకుఁడు. దీనితో హెచ్చుగముచ్చటలాడి చొక్కంపకుఁడు.

(నిష్క్రమించును.)

సుభ:— వధూనీ! అన్నమాటనిజము. నాయెడకు నొక్కరును రాకుఁడు. నన్ను విశ్రమింపనిండు.

రేవ:— (పోవును)

సుభద్ర:— వసంతసేనకుమారి నాయనుఁగుచెలి, నాభద్ర యెట్టి ధీరమానసముకలది? ఇట్లనుటచేత నేను భీరువనని యొప్పికొనుటకాదు. నాయన్న లిదివఱకు నాకేమిటఁగొఱంత జేయక నామాటకు మారాడక, నావాంఛకు వేఱెంచక, నాప్రీతికిఁబ్రీతి బల్కక, నావాదము కాదనక, యాదరించుచుండుటచే నాస్వభావ గాంభీర్యమును నేనెఱుఁగకుంటిని. ఇప్పుడు నామనగడనంతయువమఁడవుజేయ నాయగ్రజుఁడు బద్ధకంకణుఁడై యుండుటబట్టి నామడిమంచబాపి మగటిమి జూపవలసివచ్చినది. రెండంశములు యోచనీయములై యున్నవి. నాబ్రతుకంతయు నిరర్థకముజేసుకొందునా, లేక నాయన్నగావించినదానికి మారుబన్ని నాఖిన్నత్వము బాపుకొందునా? రెండవదియేయుక్తము.

మ॥ ధరపై రాజకులంబులో జననమాధన్యంబు నేగాంచుచున్।
ఇరవారన్ శరవిద్యలన్ జదురనై-యిమ్మొందినేనుండగన్।
గురుధైర్యంబునుజూపునట్టితరిలో-గొంకొందిశంకింతునా?
నరునీవీటికిఁదోడితెచ్చుకృతికై-నాభద్రనంపించెదన్॥

(వ్రాయుటకు సిద్ధపడి)

హృదయమా! చలింపకుము.

నీకైతవముకామపాలునకు హితముకాదని వెనుదీయకుము. నీచేత, బలుసాహసంబని భీతిల్లకుము. చేరుగడనున్న ధైర్యమును బాఱఁదోలకుము. హస్తమా నీవు స్థయిర్యముఁవహింపుము. నీవు తలపెట్టినది వంపు శౌర్యముకాని కలుషకార్యము కాదు, నీవు పట్టనున్నది పలుచనికలముగాని పదునగు గత్తి కాదు. కలమా! నీవునావ్యాకులజలధికిఁగలమై, నాకేలునకుబలమై, నా

వలపు మూసికాదని తెలుప నీమసిలోనమునిగి, నావల్లభుని చల్లని యుల్లమువలెనున్న యీ తెల్లని కాగిదముపై నవ్రాలి, నామోహమర్మమును వ్రాయుము. (వ్రాయును.)

ఉ॥ అన్న హలాయుధుండు నను నారడి బెట్టుచు గౌరవేశు నా।
మన్నియఁ జేసి నామనువు మాపు మనంబున నున్న వాఁడయో!।

(ఇంతమాత్రమే వ్రాసియుంచును.)

[ప్రవేశము భద్ర-మగవేషమున]

భద్ర:— (నవ్వుచు వచ్చి) సుందరీ! సుభద్రా! నాకు స్వాగతమే కదా?

సుభ:— దుండగీఁడా! నీవెవ్వడవు? ఏల వచ్చితవి?

భద్ర:— వన్నెలాడీ? నాకు కుశలమే కాని, నీకును కుశలమా?

సుభ:— దుష్టుఁడా! నిన్నెవరు లోనికి రానిచ్చిరి?

భద్ర:— వారిజాక్షీ! మావారందరు క్షేమముగనున్నారు. మీవారికిని క్షేమమే కదా?

సుభ:— కుటిలాత్మా! వెడలిపొమ్ము చటినుండి.

భద్ర:— కుటిలకుంతలా! తొలుత నీవు కూర్చునుము. పిదప నేను కూర్చుందును.

సుభ:— క్రూరాత్మా! సురాపానము జేసివచ్చి, యంతఃపురము జొచ్చి వదరెదవా?

భద్ర:— మదిరాక్షీ! నీయధరసుధాపానము జేసి, యంతరంగమున మెచ్చి వదలెదను. (సమీపించును)

సుభ:— పలువా! ముందునకడుగిడిన నీతలపగులును.

భద్ర:— పొలంతీ! ముద్దునకొడఁబడిన నాతలఁకగలును.

సుభ:— అధముఁడా! నీవేమి బధిరుఁడవా?

భద్ర:— మదవతీ! నీమాట మధురమే.

పాట (అనుబంధము 16)

సుభ:— భద్రము. నీప్రాణము గాచుకొనుము. (కత్తి తీయును)

భద్ర:— ఈభద్ర కెప్పుడును భద్రమే! (నిజరూపము జూపును.)

సుభ:— అయ్యో! అక్కా! ఎంత మోసము జేసితివే?

భద్ర:__ ఇంత మోసము జేయుచున్న నీప్రాణకాంతుఁడు నాచేతికిఁ జిక్కునా? దారిలో నేను బ్రతుకుదునా?

సుభ:__ అక్కా! ఈమగవేషము నీకెంతయొప్పియున్నదే?

భద్ర:__ నన్ను నీవు పెండ్లాడునప్పుడు వర్ణింతువులెమ్ము. ఏదీ పత్రిక! తెమ్ము.

సుభ:__ (పత్రికనిచ్చును) అక్కా! నీకు నెక్కువగా నేను చెప్ప వలసినదేమున్నది?

భద్ర:__ శీఘ్రము విజయుని గూర్పమనియే (అనిపోవును పత్రికను చదువుచు మరలివచ్చి) ఇదియేమే పత్రికపూర్తిగ వ్రాయలేదు?

సుభ:__ అక్కా నాకుముందు తోఁచలేదు.

భద్ర:__ అట్లనా? నేనుముగింప యత్నింతును.

(యోచించి వ్రాయును.)

ఉ॥ అన్నహలాయుధుండు నను నారడిబెట్టుచు-గౌరవేశు నా
మన్నియఁజేసి నామనువుమాపుమనంబున-నున్నవాఁడయో!।
క్రన్ననవచ్చి నిన్వలచుగన్నె సుభద్రకరంబుఁబట్టగా ।
బున్నెమగుఁగదావిజయ! భూరిదయాహృదయా! ధనంజయా! ॥

సుభ:__ (చదువును) సంతోషమున భద్రను కౌఁగలించుకొనును.

(తెఱజాఱును.)

---

## తృతీయాంకము-ప్రథమరంగము.

ద్వారకచెంత-ఉద్యానవనము.

[ప్రవేశము-ఘటోత్కచుఁడు బ్రాహ్మణవేషమున]

ఘట:__ అహ్హహ్హా! (నవ్వుచు) నేనెంత సొగసుగనున్నాను! ఉం డకనేమి? వేసినది వేషము. ఆవేషమును దాల్చుటలో వారివీరి పోలికయేందుకని యించుమించుగ నర్జునునిరూపమునకు సరి పోవు రూపమునే ధరించితిని. అందువల్లనే ముద్దుగనున్నాఁడను. ఇంక దారిలో నన్ను గాంచి గారవింపని మానవుఁడేలేడు. ఎదు టబడినవారు చేసిన నమస్కారములకు నేను పురస్కారముచే

యలేక వేసరితిని. వట్టిదండములు బెట్టువారలేకాని నాకడుపు నిండ భోజనముపెట్టువారులేరు. నిన్నరాత్రి నన్నువిందునకు బిలచిన బ్రాహ్మణుఁడు పండ్రెండు మాసములకు గ్రాసముగ జేర్చిన పదార్థములన్ని వండించినను నవి నాకొక్కదండి కబళమైనను గాకపోయెను. ఇంకద్వారకలో నాతిండికి నెందఱియిండ్లు పాడగునో? నేనేమిచేతును. కడుపుచెడ్డది. అందులో బ్రాహ్మణుని గడుపు.

ఉ॥ పోడిమికూడుపాయసము-పొంగలిపేణి మిటాయిలాడులుఁ౯।
వేడుకమెక్కియొక్కమొగిఁబెండిలిశాస్త్రిదప్పు భక్ష్యపేటికల్ ।
మేడలుబండ్లునోడలును-మిన్నువసుంధర సూర్యచంద్రులఁ౯ ।
బాడబమైనమిన్గఁగలఁ-బాఁపనిపొట్టకు సాటియున్నదే? ॥

ఇచ్చటికి ద్వారక యొకక్రోశమున్నది. ప్రభాతమగుచున్నది. ఈ తోఁటయందించుక విశ్రమించి పురము బ్రవేశించెదను. (చప్పుడువిని) ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది. నాజపము నారంభించెదను. (కూర్చుని ధ్యానముననుండును.)

[ప్రవేశము-భద్ర మగరూపున)

భద్ర:— నాసదనమునుండి వెడలి యుదయమగులోపల నీయుద్యానవనమును జేరితిని, ఇచ్చట నించుక ఫలహార మొనర్చి నీరము ద్రాగి ముందుదారి బట్టెదను. (ఘటోత్కచునిజూచి) ఈపురుషుఁడెవఁడుండవచ్చును? సామాన్య విప్రునకిట్టి భవ్యదేహము, దివ్యతేజము, నవ్యరూపము నుండనోపదు. భూలోకనివాసులగు యావన భూసురశ్రేష్ఠులనెందఱినో చూచినదానను. ఇట్టివన్నెవాసి యెవరియందునుగానను. పెండ్లియన్న నసహ్యపడుచున్ననాకు నీవిప్రునిఁగాంచి నప్పటినుండి, పురుషుఁడులేని వెలఁదిమనికి నిష్ఫలమని స్ఫురించి మది చలించుచున్నది. నాతారుణ్యమును ధారపోయువలయునన్న మోహసుందరుని వరింతునేకాని సామాన్యునిఁ గన్నెత్తియైనఁజూడను. ఈమనుజశేఖరుఁడు భూసురుఁడైనను నామానస సరోజభాస్కరుఁడై యున్నాఁడు.

ఘట:— (కన్ను తెఱచి మరల మూసుకొనును.)

భద్ర:— విప్రపుంగవా మీరెవరు?

భద్ర:— నేను ద్వారకాపురవాసిని. యాదవకుల రాకొమరుఁడను. భద్రుఁడనువాఁడను.

ఘట:— రాజకుమారా! నేను హస్తినాపురమునందొక బ్రాహ్మణుఁడను. రాజనాటకసభకు సూత్రధారుఁడను. నాపేరు జయుఁడు.

భద్ర:— (స్వ) ఆహా! ఇతఁడు నిక్కముగ నాటకమాడుచున్నాఁడు. ఇతనిపేరు జయుఁ డనుటమిథ్య. ఇట్టి తేజోవంతుఁడు మా విజయుఁడేయై యుండవచ్చును. ఆభూపాల నందనుఁడు మారువేషమున బేరుమార్చుకొని యిచ్చటికిరాను కారణమునుగలదు. నిదానముమీద నంతయుఁదెలియును. (ప్రకాశము) భూసురోత్తమా! మీరిచ్చటికి వచ్చిన కారణము నడుగవచ్చునా?

ఘట:— రాజకుమారా! నీవు నిచ్చటికివచ్చిన కారణము నడుగ వచ్చునా?

భద్ర:— నేను ద్వారకలోని గృష్ణనాటకసభలో నటివేషధారిని. మాసభకు దగునైన సూత్రధారుఁ డిదివఱకు జేకూడనందున నట్టివాని వెదుకబోవుచు దారినుండు నీతోఁటకు వచ్చితిని.

ఘట:—(స్వ) ధ్వనిఁజూడ బురుషుఁడుగ దోఁచదు. చిన్నాలన్ని యెన్నగ నిది యన్నుగనే తోఁచుచున్నది. ఏదో మగువమగవేషమునను న్నది. దీనినాటకమేదో కనిపెట్టవలయును. (ప్రకాశము) రాజవదన! కాదు. రాజనందనా! మన్నింపుము. సూత్రధారుఁడు నటిని సంబోధించునట్టి మాటను బొరపాటున నుడివితిని—నేను ద్వారకలో జరుగబోవు సుభద్రా సుయోధనుల పరిణయకాలంబున మాసభవారి నాటకఖేలనములు జేయుటకు దగు నెర్పాటు లొనర్పబోవుచున్నాను.

భద్ర:— (స్వ) ఇతఁడు విజయుఁడగునను నాయభిప్రాయము క్రమక్రమముగ స్థిరమగుచున్నది. (ప్రకాశము) రాజవర్యా! కాదు. విప్రవర్యా! క్షమింపుము. నేను రాజపుత్రుఁడనగుటచే రాజుల సంబోధించి యభ్యాసము. నీనాటకసభలో సూత్రధారులెంద ఱున్నారు?

ఘట:— ఇద్దఱున్నారు.

భద్రి:— నటీకాంత లెందఱు?

ఘట:— ఒక్కతెయే.

భద్రి:—అట్లయిన నేను బూనినకార్యము నెఱవేఱినది. ఇంక నేను ముందునకుబోవ నక్కఱలేదు. నీకార్యమునకు నేను సహాయ మొనర్చెదను. రమ్ము ద్వారకకు.

ఘట:— నీకార్యమెట్లు నెఱవేఱెను?

భద్రి:— ఇద్దఱు సూత్రధారులలో నొకఁడు నీసభకాయెను. నీవు నాసభకైతివి.

ఘట:— అదెట్లగును? నేనొప్పను.

భద్రి:— నీవుకోరిన భోగభాగ్యములన్ని లభించుచుండ నెట్లొప్పవు

ఘట:— ఊ ఇదికానిపని. నేనులేకపోయిన మాసభవారు ద్వారకకే రారు,

భద్రి:— ద్వారకలో సుభద్రాసుయోధనుల పెండ్లినిలచి వేరు పెండ్లియైన వచ్చెదవా?

ఘట:— ఆవేరుపెండ్లి యేదియగును?

భద్రి:— సుభద్రా విజయులది.

ఘట:— (నవ్వున) అప్పుడేమొ?

భద్రి:— ఏమో యనెద వెందుకు? ఆపెండ్లికి నీవు రానేవలయును.

ఘట:— అదేల?

భద్రి:— పెండ్లాడు విజయుఁడు సూత్రధారుని కొమారుఁడుకదా?

ఘట: —నీమాటలు నాకర్థముగాదు.

భద్రి:— అర్థముకాదా? అయిన వినుము. సూత్రధారుని కుమారు డన్న నిందనందనుఁడు. అతఁడే విజయుఁడు తెలిసెనా?

ఘట:— ఏమోతరుణీ! నీచమత్ .........(నిలుపును)

భద్రి:— నేను తరుణినైన నీవు వివర్ణలోపమునొందిన విజయుఁడవుకావా?

ఘట:— నీవు సువర్ణము నిరసించిన సుభద్రవుకావా?

పాట-ఇద్దఱిది (అనుబంధము 17)

భద్ర:__ నేను సుభద్రనుగాను.
ఘట:__ నేను విజయుఁడనుగాను.
భద్ర:__ నేను నమ్మను. నీవు విజయుఁడవే.
ఘట:__ నేను నమ్మను. నీవు సుభద్రవే.
భద్ర:__ అయిన యీజాబు (తీయును)

[ప్రవేశము-రుక్మిణీ]

రుక్మి:— (బ్రక్కనుండి) కృష్ణా! ఇటురమ్ము.
భద్ర:__ (శీఘ్రముగబోవుచుండ పత్రిక జాఱిపడును.)
ఘట:__ (పరుగిడును.)
రుక్మి:__ కృష్ణా!

[ప్రవేశము-కృష్ణ.]

కృష్ణ:__ ఏమి రుక్మిణీ! పిలిచితివి.
రుక్మి:__ ఈతోటయందెవ్వరో బహుబీభత్సముగ సరసములాడు చున్నట్లున్నది.
కృష్ణ:__ ఏదీ! ఎవ్వరున్నారు? (పోయి క్రిందబడియున్న పత్రికను జేకొనిదాచి) రుక్మిణీ! ఎవ్వరును గానరారే?
రుక్మి:__ నేనేమొ దూరమునుండి చూచితిని. ఒకపురుషుఁడు నొక తరుణియు దగవులాడుచుండిరి.
కృష్ణ:__ మన విహారవనమున మనోహరకార్యము లెన్నియో జరుగును. వాటిని మనము చూడనేల? పాటింపనేల? రుక్మిణీ! చూచితివా యీపొదరిల్లు?
రుక్మి:__ ఆహా! ఎంతవిలసిల్లుచున్నది? ఇచ్చటి చల్లనిగాలికి నుల్లము రంజిల్లుచున్నది.

పాట-ఇద్దఱిది (అనుబంధము 18)

ఘట:__(మఱుఁగునుండి) (స్వ) సుభద్ర యీతోఁటఁత్రోవల నెఱిఁగినది కావున దప్పించుకొనిపోయెను. నేనిక్కడ చిక్కుపడితిని. విధిలేక నిందు జరుగునదంతయుఁజూచి వినవలసి వచ్చినది.
కృష్ణ:__ రుక్మిణీ! ఈగ్రీష్మఋతువు గాలి మేలైనదికాదు. ఆవసంతసౌధములోనికిఁ బోవుదము రమ్మా.

రుక్మి:—నాథా! అచటికి నీవేపొమ్ము. నేనురాను.

కృష్ణ:— రుక్మిణీ! ఏలనే నీకింత గోపము?

రుక్మి:— ఆసౌధములో నీభామ, సత్యభామ కులుకులభామ సొగసుల సుందరియున్నది. దానిముద్దుమొగము జూడక చాలపొద్దయినది, పొమ్ము.

ఘట:— ఇది యిద్దఱుభార్యలు గలవాని సుఖము.

కృష్ణ:— సత్య యిట్చటికి బోయినది నాకేమి తెలుసును? మన సుభద్ర యచ్చటనున్నదని నిన్ను రమ్మంటిని,

ఘట:— ఇది హరిశ్చంద్రునిగూడ బొంకింపజేయు సమయము.

రుక్మి:— ఏల యీటక్కులు? నాకోపముపెంచక యూరకపొమ్ము.

[ప్రవేశము-సుభద్ర]

సుభ:— అన్నా కృష్ణా! వధూని సత్యభామ నన్నొంటిగవిడచి తన సఖులను వెంటబెట్టుకొని యింటికిఁబోయెను రేవతీ బలరాములు వసంతసౌధమునకు బోవుచున్నారు. మనమును పోవుదము రమ్ము.

కృష్ణ:— సుభద్రా! ఇచ్చట రుక్మిణియున్నది. రమ్ము.

ఘట:— (సుభద్రనుజూచి) సుభద్ర! ఈమెయా సుభద్ర?

రుక్మి:— సుభద్రా! ఈమాయకాఁడొంటిగ జిక్కియున్నాఁడు. నీవిషయమున నేమిచేయనున్నాడో యడిగెదను. వచ్చికూర్చొనుము.

సుభ:— (కూర్చునును.)

రుక్మి:— నాథా! మొన్న యీసుభద్ర యంతగాసి నొందియుండెను. నీవేలవచ్చి విచారింపవైతివి?

సుభ:— వధూనీ! ఈమాటయడుగవలయునా? నాక్షేమచింతన లేనివారికి, నాపై ప్రేమ యెట్లుండును?

కృష్ణ:— సుభద్రా! నన్నేల దూరెదవు?

సుభ:— అన్నా! నిన్నుదూరను. నాదేవుని దూరెదను.

కృష్ణ— సుభద్రా! ఆబలభద్రుని మూర్ఖమును నీవెఱుఁగవా? ఆ సమయమున నేను వచ్చియుండిన నొకటె. రాకుండునదొకటె.

రుక్మి:— నాథా! సుభద్రను విజయుని కియ్యవలయునని, నీయన్నతో జెప్పితివా?

కృష్ణ— చెప్పితిని. వినలేదు. నేనును వసుదేవాది వృద్ధులందఱును భవిష్యత్తు నెఱుఁగనివారమట. తాను దూరదర్శియట.

రుక్మి:—ఇదేమి మూర్ఖము? మన సుభద్రవిజయునిఁదప్ప వేరొకనిఁ బెండ్లియాడనని ముష్కరము పట్టియున్నదే. బలరాముని బ్రయత్నము కొనసాగునా?

కృష్ణ:— నాకేమి తెలుసును? బ్రహ్మఘటన యెట్లున్నదో?

రుక్మి:— బ్రహ్మతండ్రివినీవు. నీకు దెలియనిదేది?

కృష్ణ:— (నవ్వుచు) ఆసంగతి మనసుభద్రకే తెలియును.

సుభ:— అన్నా! నాకేమి తెలియును? నీవుమంచివాఁడవే. (అనిపోవనుండ)

కృష్ణ:— చెల్లెలా! నీకును దెలియదు. నాకును దెలియదు. ఆవిజయునకైనను తెలియునుకదా?

సుభ:— (వెడలిపోవును.)

రుక్మి-కృష్ణ:— పాట-ఇద్దఱిది (అనుబంధము 19)

కృష్ణ:— దీనికి చింతయేల? పోదమురమ్ము,

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఘట:—(ముందునకువచ్చి) ఆహా! అంతయు విశదమాయెను. ఇఁక నాబలరాముని బెండ్లి నేను జేసెదను.

[ప్రవేశము-కృష్ణ వెనుకనుండి]

కృష్ణ:— (ఘటోత్కచుని వీపుదట్టి) బ్రాహ్మణా! నాయన్నపెండ్లి నీవుచేసిన, నీపెండ్లి నేనుజేయలేనా?

ఘట:—(మ్రొక్కి) కృష్ణా! భక్తరక్షకా! కాపాడుము. నీదర్శనంబున నాపాపములు దూరములై పావనుఁడనైతిని. చింతలన్నియు నంతరించెను.

కృష్ణ:— భీమపుత్రా! ఇదేమి యవతారము?

ఘట:— దేవా! ఇది నీయైదవ యవతారము. నీవు బలిదానవునకై వామనుఁడవైతివి. నేను బలరామునకై బ్రాహ్మణుఁడనైతిని. నీకు దెలియనిదేమున్నది? నీసోదరీమణి సుభద్రాదేవికై విజయుఁడు సన్యాసియై నిన్ను నమ్మియున్నవాఁడు.

కృష్ణ:—నీభద్రినేమిచేసెదవు?

ఘట:— (తలవంచును)

కృష్ణ:—భీమపుత్రా! భయపడకుము. తండ్రికుమారులకిరువురికిని గల్యాణమగును. నీసన్యాసిని రైవతకగిరిపర్యంతము గొనిరమ్ము యతులవిధేయుఁడగు బలరామునిదర్శించి నీయుక్తిగొలఁది కార్యము సాధింపుము. ఇదిగో! నీభద్రి క్రిందబడవైచిన జాబు యిది. దీనిని నీసన్యాసికిమ్ము. కడుజాగ్రతగ మెలఁగుము. లేకున్న హలధరుని ముసలము పాలగుదువు.

(నిష్క్రమించును)

ఘట:— (జాబుచూచి) ఈపత్రిక ముద్రితమై, విజయున కంకితమై యున్నది. ఈముద్రిలో "సుభద్రి" యను నక్షరములున్నవి. నానటి భద్రియే ఇంక చింతలేదు.

[ప్రవేశము-రేవతి బలరామ]

బల:— రేవతీ! కృష్ణ నేవకుఁడుచెప్పిన విప్రపుంగవుఁ డితఁడేమై యుండనోపు. (ఘటోత్కచునిజూచి) భూసురోత్తమా! నమస్కృతులు. ఈబలరాముని బూజల స్వీకరింప విచ్చేయుము.

ఘట:— భలభద్రా! నీకు శుభమగుగాక!

బల:— భూదేవోత్తమా! మీరెవరు?

ఘట:— నేనుపర్జన్యనామకయతీశ్వరుల శిష్యుఁడను. గర్జన్యుఁడనువాఁడను.

బల:— ఆ యతీంద్రులెచటనున్నారు?

ఘట:— మీరైవతకగిరిపైననే యున్నారు.

బల:— ఈవార్త యిదివఱకు నాకెట్లు తెలియదాయెను?

ఘట:— మాగురువులు సాధారణముగ బయలునకు బఱువారు గారు. వారితపస్సంతయు లోలోపలనే. వారి నిజస్థితి నెవ్వరు నెఱుఁగరు. శిష్యుఁడనగు నాకే యచ్చరువగుచున్నది.

బల:— అట్లయిన రేపు వారిదర్శనమునకై పయనమయ్యెదము. మీరు మాపూజలు నేఁడుగైకొన మావెంటరండు.

ఘట:— ఆఁ! ఆఁ! అదెన్నిటికిని కాదు. నేనింతవఱకు గురువులవారిని విడిచియుండుటయే యెంతయో చింతగనున్నది. వారు పూజకుఁగోరిన యరిది పుష్పము లీవనమున నుండుటచేత నేను వచ్చితిని. పూజాసమయమునకు బోవలయును. ఇంకమూఁడుదినములు వారు గుహనుండి వెలికిరారు. నాలవనాఁడు మీరవశ్యము దర్శనమునకు రండు.

బల:— భాగ్యము.

(తెరపడును.)

---

## తృతీయాంకము-ద్వితీయరంగము.

రైవతకగిరి.

(అర్జునుఁడు-సన్యాసివేషమున)

అర్జున:— నావలె నాశ్రమధర్మముల నిర్వహించినవార లెవ్వరు నుండరు. లక్కయిల్లువిడచి వెడలి కుమ్మరవానియిల్లు చేరువఱకు బ్రహ్మచర్యాశ్రమమును జరిపితిని. పిమ్మట పాంచాలినిఁ బెండ్లాడి గృహస్థాశ్రమమును జరిపితిని. పిదప భూసంచార మారంభమై వానప్రస్థాశ్రమమును ప్రభాసతీర్థమువఱకు జరిపితిని. అచ్చటినుండి యీయతియాశ్రమము ప్రాప్తించినది. బ్రహ్మదేవుఁడు నానొసట నెన్ని వేషములు వ్రాసెను? జన్మమున రాజవేషము, దేశభ్రష్టత్వమున భిక్షుకవేషము, తీర్థయాత్రకు విప్రవేషము, సుభద్రకై సన్యాసివేషము, ఇక తక్కువైనది యొక్కటే-స్త్రీవేషము. ముందేమగునో యెవ్వరెఱుఁగుదురు? నేను వేసరికచే నోరుజాటి సన్యాసినయ్యెదనన్న మాత్రముననే ఘటోత్కచుఁడు నన్ను నిక్కంపు సన్యాసినిఁ జేసి యీరైవతకగి

రకిఁ దెచ్చియున్నాఁడు. ఇది శ్రీకృష్ణుని యాజ్ఞయఁట. ఏమైన గాని ఆసుభద్ర నాకుఁజిక్కినఁ జాలును. (పత్రికదీసి) ఇదియా జవ్వనిజాబు. సుభద్ర ప్రేమమానసము నాయెడ్డఁబదిలమైయున్నది. ఆబాలతికి నెంత వలవంతయుండినవో యీ పత్రిక వ్రాసినది. నాప్రాణ బాంధవుఁడు, నామిత్రుఁడు. నాదైవమునగు కృష్ణుని సంపూర్ణకారుణ్యము నాపైనుండుటచేతఁగదా సుభద్రా మోహమానసమును గనుగొంటిని. ఈపత్రికకుఁ బ్రత్యుత్తరము వ్రాసియుంచినాఁడను. యాదవులిచ్చటికి వచ్చెదరట. ఇక నాధ్యానానుష్ఠానమొనర్చెదను.

సీ. ఎప్పుడుగజయానయిందునందపుమోముఁ గనులఁబండువుగాఁగఁ-గాంచగలనొ?
ఎప్పుడుకలవాణి-యెలమిముచ్చటలాడ-వీనులతమిదీఱఁ-వినఁగఁగలనొ?
ఎప్పుడునాకూర్మి-యింతివరాస్యనుఁజేపట్టుపుణ్యంబుఁ-జెందఁగలనొ?
ఎప్పుడుమదిలోని-యీప్సితంబలరారఁ-చెలినినాకౌఁగిటఁజేర్చఁగలనొ?

గీ॥ ఎపుడునాతాపవారాశి-యింకఁగలదొ?
ఎపుడునామానసంబున-కిమ్ముకలదొ?
ఎపుడుహితమైనయానంద-మెసఁగఁగలదొ?
ఎపుడునాకృష్ణునకుఁదయ-యెలయఁగలదొ? ॥

[ప్రవేశము—ఘటోత్కచుఁడు.]

ఘట:— పితృవ్యా! ఇట్టి సొగసైన భగవద్ధ్యానము నీవు జేయువాఁడవని బలరామునకుఁ దెలిసెనేని ద్వారకను, సుభద్రనుఁ జూచునది మనవీపులే.

అర్జు:— కుమారా! ఈక్రొత్తసన్యాసమున నేనెట్లు ప్రవర్తింపవలయునో చెప్పుము.

ఘట:—దీనికిఁబెద్ద గ్రంధములేదు. అల్పమే. నీవు కన్నులు మూసుకొని మౌనముగ ధ్యానముజేయుచుండుము. ఎవ్వరైన బలుకరించిరేని "నారాయణ" అనుము. ఇదియే మూలమంత్రము. ఈమంత్రమునకు సంకల్పముగాని, యంగన్యాసకరన్యాస దీర్ఘ ధ్యానాదులుగాని, యేమియు నక్కఱలేదు.

అర్జు:—కానిమ్ము. నీవు చెప్పినట్లె యొనర్చెదను.

ఘట:—(లోనికిబోయివచ్చి) పితృవ్యా!

అర్జు:— నారాయణ.

ఘట:— నాకెందుకు నారాయణ? అది యాదవులకె.

అర్జు:— యాదవులింకను రాలేదు. నాకృష్ణుఁడు నన్ను మఱచె నేమొ?

ఘట:— అదిగో! భగవానుఁడు. నీవుతలఁచిన క్షణముననే ప్రత్యక్షమైయున్నాఁడు.

[ప్రవేశము-కృష్ణుఁడు.]

అర్జు:—(చేతులు మోడ్చి)

కం|| నీపాదములకుఁగృష్ణా!
నీపార్థుండెరఁగుగరము నెయ్యముమీరన్
ఆపద్బాంధవ! కేశవ!
కాపాడుము దేవదేవ! కంజదళాక్షా! ||

కృష్ణ:- కం|| నాకేశకుమారవిజయ!
నీకాశుభమింతలోన నెమ్మదిగనుమా
నీకోరికయతిరయమునఁ
జేకూడిసుభద్రనీవు-జేపట్టనగున్ ||

పార్థా! నీసంతాపము శాంతిఁబొంది, నీకు నత్యంతసంతోషము కలుగుసమయము సమీపించియున్నది. నరుఁడవై, ధర్మసోదరుఁడవై, గాండీవధరుఁడవై, ప్రేమకాకరుఁడవై, సౌందర్యమరుఁడవైయుండు నీవు సుభద్రకు వరుఁడుకాకుందువా? నీతోసంభాషించుట కవకాశములేదు. అదిగో బలరామాదులు వచ్చుచున్నారు. వారు నిన్ను ద్వారకకుఁ దోడ్కొనిపోయి సత్కరింతురు. నీవు నీమఱఁదలినిఁజూచి మైమఱపు నొందకుము. జాగ్రత. (నిష్క్రమించును)

(ప్రవేశము-బలరామాదులు వాద్యములతో)

యాదవపురుషులు, స్త్రీలు:— (ఒక్కరొక్కరుగ నర్జునునకు నమస్కరింతురు.

అర్జు:— నారాయణ యనుచుండును.

సుభద్ర:— (నమస్కరించును)

ఘట:— సుభద్రాకన్య నమస్కరించుచున్నది.

అర్జు:— నారాయణ

ఘట:— అందఱును గూర్చునుండు.

బల:— యతిపుంగవులారా! కనికరించి మీ వార్త నాకింత నాన తిండు. ఏ యే క్షేత్రంబులు దర్శించితిరి? ముందెందుబోవ నభి లషించెదరు?

అర్జు:— బలభద్ర! సర్వధరణీ తలంబున సంచరించు కర్మందుల వార్త యేమని చెప్పనగును? మాబోటివారు సేవింపని పుణ్య క్షేత్రంబులేయుండవు. అందున రైవతకాద్రి సహితముచేరి నట్లాయెను.

బల:— యతీంద్రా! మీసందర్శనమువలన నాదురితంబులన్నియు దూరమాయెను.

ఘట:— దర్శనమువలననే యింతైన నికస్పర్శనము వలననెంత గునో?

బల:— మునిపుంగవా! మీరునాపుణ్యవశంబున నిచటికివిచ్చేసితిరి చాతుర్మాస్యము సమీపించియున్నది. కరుణించి మామందిర మున కరుదెంచి, మాసత్కారంబుల స్వీకరించి మముంగృ తార్థులఁజేయఁ బ్రార్థించుచున్నాఁడను.

అర్జు:— కామపాలా! రాగదూరులైన మాయట్టి యోగులకు నాగనివాసమే యోగ్యమగును కాని నగరావాసము తగదు ఏలనన్న యీస్వరూపాంత్య మేనాఁడు కానున్నదో? అది యెచ్చోటనో?

ఘట:— (స్వ) ద్వారకలోనే యీ రూపమంత్యమగును.

బల:— స్వామీ! ఎట్లయిన నను గ్రహింపవలెను.

అర్జు:— హలధరా! నీకంత యభిలాషయున్న నవశ్యముకానిమ్ము.

బల:— నాపుణ్యము ఫలించెను.

ఘట:— లెండు లెండు. దేవపూజ హారతులుకానిండు. స్వాముల వారి యనుగ్రహము ద్వారకమీద ప్రసరించినది. తూర్యములు వాయింపుఁడు (స్వ) తర్వాత శంఖములు బూరింపుఁడు.

అందఱు:— (పల్లకిలో నర్జునుని గూర్చుండబెట్టి వాద్యములతో వెడలుదురు).

## తృతీయాంకము-తృతీయరంగము

(బలరామ-రేవతి)

రేవతి:— నాథా! నీతమ్మునికి జాలనాగ్రహముకలిగినది.

బల:— నీవేయందఱితో నేమోమోచెప్పుకొనుచు నందఱియెదుట నన్ను నిందించుచు నెగురులాడించెదవు.

రేవ:— నీయవివేక చర్యలకు నేనులేకున్న నిన్నందఱును జేరి యున్మాద వైద్యశాలకు బంపుచుండిరి.

బల:— నాదియవివేకమా? ఏదియొక్కటి నిరూపింపుము చాలును.

రేవ:— యతిని యంతఃపురమునకు దెచ్చియునిచి జగన్మోహన సుందరియైన సుభద్ర నతనిసేవలకు నియమించినది యవివేక మొక్కటియేనా? వెఱ్ఱి, పిచ్చి, యున్మాదము.

బల:— అబలా! నీకు బాపపుణ్యములు తెలియకతలతిరుగుచున్నది. యతులుత్తమ నీతిపరులని తెలియుము.

రేవ:— ఏదైన నొక్కయకార్యమయినప్పుడు తిరుగుటకా యింత తలలేకపోవును. యతుల తాత విశ్వామిత్రుడు మేనకకడ జూపిన నీతిలోకవిఖ్యాతి జెందియున్నది.

(నిష్క్రమించును)

[ప్రవేశము-కృష్ణ]

కృష్ణ:— అన్నా! సుభద్ర యతిసేవ జేయనేవలెనా?

బల:— అవును. అదితప్పనిపని.

కృష్ణ:— కం॥ సుందరరూపుని మానిని।
నందపుభామలు వసించు-నంతఃపురిలో।
బొందుగనీవిట్లునిచిన।
బొందెదమందఅపవమతి-బోలదు రామా॥

బల:— గీ॥ మరునిజనకుడుశౌరి సుందరుడుకాడె।
మరునిదమనుడుశూలిసుం-దరుడుకాడె?।
వీరిబోలినపురుషుని-వేడ్కతోడ।
బూజసేయసుభద్రకు-బుణ్యమెననె॥

కృష్ణ:— అట్లయిన నీమనసు.

బల:— ఆ యతిసేవచేత మన చెలియలిపరితాప మంతయు బరిహారమగును. మీరొక్కరు దీనికభ్యంతరము గావింపకుడు.

(ఇద్దఱుబోవుదురు)

[ప్రవేశము-భద్ర]

భద్ర:— ఆ బ్రాహ్మణుఁడు కృష్ణునితో జాలమచ్చికగ మాటలాడుచు నిచ్చటికేవచ్చెను. నేనుచూచునంతలో మాయమైపోయెను వాఁడింద్ర జాలికుఁడాయేమి?

(ప్రవేశము-ఘటోత్కచ)

ఘట:— ఇంతీ! ఆతోటలోనాకు గనుపడకుండ మాయమైపోయిన కనుకట్టువిద్య నేర్పినది యెవ్వరు?

భద్ర:— బ్రాహ్మణా! ఆజాబునిమ్ము.

ఘట:— భామినీ! ఏజాబు?

భద్ర:— నీచేతికిఁజిక్కినజాబు.

ఘట:— చిక్కినది నీవు చూచితివా?

భద్ర:— చూడకున్న నేమి? అంతమాత్రము నేనుగ్రహింపలేనా?

ఘట:—కనులకుఁగానరాని దానిని గ్రహించునేర్పు నాకునుగలదు.

భద్ర:— దేనిని గ్రహించితివి?

ఘట:— నీవలపును.

భద్ర:— అదియెట్టిది?

ఘట:— నీజాబులోని యర్థమువంటిది.

భద్ర:— ఏదిచూతము జాబునిమ్ము.

ఘట:— మొదట నీవలపునిమ్ము.

భద్ర:— అది నీచేతి కెట్లువచ్చును?

ఘట:— ఆజాబు నీచేతి కెట్లువచ్చును?

భద్ర:— అదియేమాయెను?

ఘట:— ఎవ్వరిసొత్తు వారిచేతనున్నది.

భద్ర:— ఆజాబు నీవు విజయునకునిచ్చితివా?

ఘట:— అది నా రహస్యము.

భద్ర:— విప్రపుంగవా! నీవెవరవు?

ఘట:— నటీసుందరీ! ఎన్నిమాఱులు చెప్పవలయును? నేను సూత్రధారుఁడును.

భద్ర:— హాస్యములుమాని నిక్కము వచింపుము.

ఘట:— అట్లయిన నీయాన నిక్కమేచెప్పెదను వినుము. నీవు సుభద్రవు కావని తెలిసినప్పటినుండీ, నీకై విరాళిఁజెందిన నీదాసుఁడను నేను. నిన్నుపరిణయింపఁగోరు వాఁడను.

భద్ర:— నాకుఁబరిణయము కాదు.

ఘట:— ఎందుకు?

భద్ర:— మాసుభద్రకుఁ బెండ్లియగువఱకు నేను ద్వాహింపననునది నాశపథము.

ఘట:— ఇంతలోననే సుభద్రా సుయోధనుల పెండ్లిజరుగనున్నది కదా?

భద్ర:— సుభద్ర సుయోధనుని వరింపదు. వేరొకనివలచియున్నది.

ఘట:— అతఁడు ఘటింపకున్న నెట్లు?

భద్ర :—మనసారవలచిన పురుషుఁడెట్టివాఁడగుఁగాక, నతఁడు లభింపకున్న. ధీరభామినియగునది యాజన్మముకన్యయై యుండును. లేక ప్రాణమైనబాయును.

ఘట: — భళీ! కాంతా! నీయట్టి ధీరనారీమణులనుఁ బురుషులు పూజింపవలయునుకదా? ఇట్టిపావనచరితము, తరుణులకందఱికిని నెలకొనియున్న ధరాతలంబున నధర్మప్రవర్తనలు గోచరములగునా? ఒకనిపైఁబ్రేమనెరపి, యితరునిఁదిలకించి వలపుజెందు నెలఁతయొక్క బ్రతుకును, తనపైఁబ్రేమలేని భామామణిని బలిమిచేఁబొందుటకు ముదమొందుపురుషుని యొక్క బ్రతుకును, వ్యర్థజీవనంబులుకావె? మానినీరత్నమా! నీసుభద్రవలచిన పురుషుఁడెవ్వఁడో నాకు నెఱింగింపుము. నీచెలికిని యాచెలువునకును పరిణయంబును నేను సమకూర్చెదను.

భద్ర:— నీవేమి ప్రపంచములో వధూవరుల గూర్చునట్టి యధికారివా?

ఘట:— అట్టియధికారుల పితామహుఁడను నేను. లోకపూజ్యము లైన కార్యములను సాధించుటకు నేను సర్వదాసిద్ధుఁడనై యుండువాఁడను.

భద్రి:— బ్రాహ్మణుఁడవగు నీవంతటి సమర్థుడవా?

ఘట:— చెప్పు మాపురుషుని పేరు. అతనికిని సుభద్రికును వివాహము సేయకున్న నేను......భీమ......బ్రాహ్మణుఁడనా?

భద్రి:— అదేల మాటమ్రింగితివి?

ఘట:— వేఱొకమాట జ్ఞాపకమునకువచ్చెను. వినుము నీవుకోరిన వివాహముచేసిన నేమి సంభావన నిచ్చెదవు?

భద్రి:— నీకేమి బహుమానము కావలెను?

ఘట:— కం|| పారుఁడనైరుఁ-చిజూచితి|
చారురసాన్నములలోని-స్వాదములెల్లన్|
కోరితినీయధరమధువు|
నెమ్మిగజవిజూడనిమ్ము నీరజనయనా||

నేను గోరు బహుమానము నీయధరామృతపానమే.

భద్రి:— అట్లయిన, మాసుభద్రికు నర్జునునకు వివాహము చేయుము.

ఘట:— నేను ద్వారకకువచ్చిన కార్యమేయది.

భద్రి:— ఏమి? ఏమి? సంగతినంతయు జెప్పుము.

ఘట:— సుభద్రికు నర్జునునకు సంగతి. బలభద్రునకు వికృతి. దుర్యోధనునకు దుర్గతి. నీకు సంప్రీతి. ఇకనిమ్ముముద్దునకు సమ్మతి.

భద్రి:— నీఅర్థోక్తు లేల? విశదముగా చెప్పుము.

ఘట:— రహస్యమంతయు వినవలయునన్న నా సమీపమునకు రమ్ము.

భద్రి:— (సమీపించును.)

ఘట:— (చెవిలో నుడువును.)

భద్రి:— అట్లనా? ప్రియా! కాదు. ఆర్యా-నిన్నేమని పిలువవలెను?

ఘట:— పిలువవలసినరీతిగనే పిలచియున్నావు. ప్రియుఁడన్న, నా ర్యుఁడన్న నీనాథుఁడేకదా.

పాట-ఇద్దఱిది (అనుబంధము 20)

(నిష్క్రమింతురు.)

[ప్రవేశము-రుక్మిణి-కృష్ణ]

రుక్మి:— కృష్ణా! ఈబ్రాహ్మణుఁడెవ్వఁడు? ఆయతిని నిచ్చటవిడిచి వెడలిపోయినవాఁడు మరల మన యంతఃపురమునకు మాకుఁ దెలియక నెట్లువచ్చెను? ఈభద్రకు వానికి నేమిసంబంధము. ఈయంతఃపురములో నీవుజరుపువిచిత్రము లొక్కటియు నాకు దెలియకున్నవికదా?

కృష్ణ:— ఏమివిచిత్రములున్నవి?

రుక్మి:—ఏమివిచిత్రములా? వినుము. మాధవీ! యిటురమ్ము.

(ప్రవేశము-మాధవి)

రుక్మి:— మాధవీ! నానాథుఁడున్నాఁడని జంకకుము. నిన్న నాతో నీవుచెప్పిన సుభద్రసంగతిని మరలచెప్పుము.

మాధవి:— (కృష్ణునివంకఁజూచును)

కృష్ణ:— మాధవీ! భయముమాని నిజముచెప్పుము.

మాధవి:— దేవా! చింతచేవాడియున్న మనసుభద్రాదేవి ముఖము స్వాములవారి సేవఁజేసిన తొలిదినముననే వికసితకమల మాయెను. తరువాత యామెకథ నేమనిచెప్పుదును? ఆమె యలంకారము జేసుకొన్న పిమ్మటనే సూర్యుఁడు పొడుచును, పూజ గడియలకన్నముందె యామెనడచును. ఆస్వామినివిడచి రావలయునన్న నామెముఖకమలమునకుఁ జంద్రదర్శనమయ్యే తీరును.

కృష్ణ:— సుభద్రబాలిక. దేవతారాధన నొక బొమ్మలాటగఁ భావించి మోద మొందుచున్నది. మాధవీ! నీవుపొమ్ము.

మాధవి:— (నిష్క్రమించును)

రుక్మి:— కృష్ణా! ఈబొమ్మలాట నీవేనా యాడించునది.

రుక్మిణి:— సీ|| వన్నె కాఁడగుయతి-పైమోహమలరిం
చి-కొమ్మ సల్పునదెట్టి-బొమ్మలాట?!
కృష్ణ:— యతివిగ్రహంబు నా-యతి వపూజించుట
బొమ్మలాటేయగు-నెమ్మలాడి।
రుక్మిణి:— సందేహమిక నేల-మందేభగామిని
యలనూని చంద్రనే-వలచెమదిని।
కృష్ణ:— మేలాయెనటులైన-లోలాక్షివినవె, సు-
భద్రసౌఖ్యముచాలఁ-బడయఁగలదు॥
రుక్మిణి:— గీ|| అకట! సన్యాసిచేతికి-నంబుజాక్షి।
నప్పగించెదు బ్రతుకెంతొ-హాస్యమగునె।
కృష్ణ:— హాస్యమెందుకే? యింతీవ-రాస్యవినవె।
తరుణికిపుడు సన్యాసియే-తగినవరుఁడు॥

రుక్మి:— ఈవార్త పురమందంతయుఁ బ్రచురమై యాదవులకు మర్యాద నిలచునట్లులేదు.

కృష్ణ:—ఇందున మర్యాదభంగమేమున్నది? సుభద్ర యాసన్యాసిని మోహించిన నామెజన్మమే పావనమాయెను.

రుక్మి:— ఇదియేమి కృష్ణా! యిట్లాడెదవు?

కృష్ణ:— కం|| కన్యామణిదుర్యోధను-
నన్యాయవిధానఁ బెండ్లియాడుటకన్నన్।
విన్యాసంబునయతియగు।
సన్యాసినిఁగూడుకొన్న-సౌఖ్యమునొందున్॥

రుక్మి:— కృష్ణా! సుభద్రకు విజయుఁడే వరుఁడని నీవేసలికతివే?

కృష్ణ:— ఇప్పుడు కాదంటినా?

రుక్మి:— నీమాటలు నేనెట్లు నమ్మెదును. అన్నియు నబద్ధములే.

కృష్ణ:— నేను ప్రమాణము జేసి చెప్పినపుడైన నిజమందువా?

రుక్మి:— నీకే దేవుఁడున్నాడని నీతో నేను ప్రమాణముచేయింతును

కృష్ణ:— ఏమన్న ననుకొనుము. నేనేమొదాచక చెప్పెదను. విజయుఁడు ద్వారకకు వచ్చియున్నాఁడు.

రుక్మి:— ఇదియబద్ధము.

కృష్ణ:— మననగరునందె పార్థుఁడున్నాడు.

రుక్మి:— ఇదికల్ల.

కృష్ణ:— సన్న్యాసివేషమున నున్నాఁడు.
రుక్మి:— అబ్బ! బ్రతికితిని. పోలికయంతయును జ్ఞప్తికివచ్చెను.

పాట (అనుబంధము 21)

ఇంక మనసుభద్ర రాత్రిపగలు యతిసేవ జేసినను వలదనను.
కృష్ణ:— రుక్మిణీ! ఈరహస్యము బయలుపఱపకుము. భద్రము.

---

చతుర్థాంకము-ప్రథమరంగము.

(పూజామందిరము,)

అర్జు:— నారాయణ! నారాయణ! నాకు నీసన్న్యాసాశ్రమమే కడు మనోహరముగనున్నది. ఎన్నిదినములనుండియో నాచిన్నారిచిలుక మోముచిన్నెఁ దిలకించు వాంఛఁగాంచి వలపుఁబెంచియుంటిని. ఈయత్యాశ్రమపుణ్యంబున నాయింతుల మేల్బంతి నా పొంతనిలచి నాతోఁగంతు పూజజేయించునంతటి యనంతసంతోషసంపదనుఁగంటిని. ఆయిందువదన మోమునందముఁ జూచుచుండ నేత్రములనుండి వెలికిఁబాఱునానంద బాష్పజలస్నానంబును; ఆరమణీమణి రూపలావణ్యంబుల వర్ణించుచు స్మరణ చేయుజపంబును; ఆసన్నుతాంగినిఁ బెండ్లియాడుపున్నె మెన్నఁడు న్నదోయని కన్నులుమూసుకొని ధ్యానమొనర్చు తపంబును నెంత మనోజ్ఞముగనున్నది? ఇంతమనోజ్ఞముగనున్నను నామనోభిలాషమింక నొనగూడకున్నదే. ఈనారాయణ పఠనమునా కెప్పుడు తప్పునో.

సీ॥ నారాయణాయంచు-నాలుకతడియారె-అలివేణినాదాహ-మాఱ్పదాయె।
నారాయణాయంచు-నతిసల్పచేతులు-కోరువేడుకలన్ని-దూరమాయె।
నారాయణాయంచు-నవసినతనువున-కతివకౌఁగిలియైన-నబ్బదాయె
నారాయణాయంచు-నీరేజముఖినెంతఁ-బూజించిననుముక్తి-పొసఁగదాయె॥

గీ॥ ఎట్టినారాయణుని నేను-కట్టుకొంటి?।
కొమ్మపెండ్లికై పేరుపో-గొట్టుకొంటి।
వట్టిచూపులతోతృప్తి-పడుటెమాయె।
పేగులారంగనరచినఁ-బెండ్లి కాదె॥

అదిగో! ఆచందనగంధిచను దెంచుచున్నట్టున్నది (ధ్యానమున) నారాయణ

(ప్రవేశము-సుభద్ర)

సుభద్ర:— అహా! నేనీ యతికులచంద్రుని నాలోకించినప్పుడెల్ల నదేమియో మున్నునే వినియున్న విజయుని విలాసరేఖలు నాస్మరణకువచ్చుచున్నవి.

సీ॥ ఈమునివరునందు నేమునువినియున్న-విజయుఁబోలికలెన్నొ-వెలయుచుండు।
చందమామనుగేఁటు-చందంపుజిగినీటు-నందమీయతిమోము-నందునుండు।
కంజదళంబుల-మంజుళంబున మించి-తలరుకన్నులసొంపు-తపసిపొందు
దేహపాంకమునింపు-బహుబింకముపెంపు-నలఘురాజకళలు-యతికిఁగలవు॥
గీ॥ మేలుపచ్చనినునుచాయ-మేనిడాలు
నవ్వుమొగమునుబోలుఫారు-జవ్వనంబు।
పువ్వువిలుకానిసింగాణిఁ-బోలుబొమలు।
జూడమనమోదుఁగవ్వడి-జాడఁదలఁచి॥

రూపమున నొకనినొకరు పోలియుండుట సహజమేయగును. స్వాములవారు ధ్యానపరవశులైయున్నారు. ఇంచుక యుపచరించెదను. (గాలివీచి కేలుమోడ్చి)

కం॥ వరమానీశ్వరశ్రీకర!।
పరమతపోనిరతసుజన-భరణాభరణా।
ఎరఁగెదనీచరణములకుఁ।
గరుణోయతిఁగాంచినన్నుఁగావుమదేవా!॥

అర్జు:— కం॥ వరకన్యామణి-ధీమణి!।
సురుచిరశృంగారిలోక-సుందరినీకున్
ద్వరలోఁగల్యాణంబై।
గురుమోదముదనరినీదు-కోరిక తీరున్॥

కన్యారత్నమా! ఇన్నిదినములనుండి నీవు నాసన్నిధికివచ్చి, న్యూనతలేకుండ, పరిచర్యఁజేయుటచేఁ బరిచయ మధికమై, మచ్చిక హెచ్చయి నీతో సంభాషించు సంతోషము జనించియున్నది. నీవు కన్యవనిమాత్రము నాకుఁదెలియును. కాని, నీవెవ్వరైనదియు, నీపేరేమగునదియు, నేనెఱుఁగను. వినుపించెదవా?

సుభ:— (తలవంచుకొని వెనుకకు జరుగును.)

అర్జు:—

సీ॥ సిగ్గునొందకుగంధ-సింధుసుందరయానమగని పేరడుగనే-మఱుఁగుఁజేరు!
తలవంపువలదునీచెలు వేనుజూచినఁ-దృష్టి తాకదు లెమ్మ-తెలవనీవు।
పెదవిఁగదల్పుమా-ముదపుమాటలనాడ-నిగురంచుఁగోర్కెఁగో-యిలలు లేవు।
కదియంగనడువుమా-కలికినీగమనంబు-నలవరింపఁగ రాజ-హంస లేదు॥

గీ॥ కన్యనినుఁగన్న వారెట్టి-ధన్యులొకొ।
పొలఁతినినుఁగాంచు వారెట్టి-పుణ్యులొకొ।
మగువనినుఁబెంచు వారెట్టి-మాన్యులొకొ।
పడఁతినీ పేరువినఁ నెంత-పావనంబొ,॥

అతివా! నీవుగొల్చుయతిపైన నీకింతఁబ్రీతి లేదా?

సుభ:— నేను కృష్ణసోదరిని. నన్ను సుభద్ర యందురు.

అర్జు:— నీవుసుభద్రవా? మంగళనామమె. అయిన నీప్రీతికి మెచ్చి నీస్వామి పెట్టిన పేరువినుము.

మ॥ కులుకుల్ నిగ్గులు ముద్దుగారుపలుకుల్-గ్రొమ్మించుమేన్మించులున్।
దళుకుం జెక్కులు మందహాసములు-నందంబొప్పు కెమ్మోవియున్
బెళుకుంజూపులు సన్నపుంగవును-శోభిల్లన్ జగన్మోహినీ।
లలనానామము జెల్లునోరమణి-లీలాలోలబాలామణీ!॥

సుభ:— యతీంద్రా! దేవపూజకు వేళ యైయున్నది.

అర్జు:— నాదేవునికి వేళయే లేదు. ఎపుడుపూజించినను సంతసించును. నీవువచ్చిన గడియనుండి కైంకర్యము జరుగుచు నేయున్నది

సుభ:— మునీంద్రా! పుష్పంబుల నందిచ్చెదను. అర్చనఁగావింపుఁడు. (పుష్పములిచ్చును)

అర్జు:— కం॥ ఏలాయీపుష్పఫలము।
లేలాశ్రమపీనిఁగోయఁ-నేణాంకముఖీ?।
బాలా! నీయెడనున్నవె।
వాలాయము లైనకుసుమ-ఫలములుసొంపై॥

ఈపుష్పములును బంప్లను వాడిపోవుటచే నీస్వామి సంతుష్టుఁడగునో కాఁడో?

సుభ:— లోకమున నందఱు సమర్పించు పూజాద్రవ్యము లివియే కదా?

అర్జు:— అవును. అయిన నేదేవునకు దేనియందు బ్రీతియుండునో నీకెట్లు తెలియును? కాని, తెమ్ము, నేఁడు వీటినేయర్పించెద.

సుభ:— (పూలనిచ్చును)

అర్జు:— (పూజయొనర్చుచు)

ఉత్సాహ॥ నీలమేఘవర్ణశౌరి! నీరజాక్షు! కేశవా!
పూలపూజసేతునీకు-బోలుభంగిమాధవా!।
ఓలగింతునిన్ను వేగ-నుత్పలాక్షిఁగూర్పుమా।
వాలుగంటిపాణియబ్బ-వాంఛితంబునీర్పుమా॥

(సుభద్రపైఁ బూలువేసి నమస్కరించును)

సుభ:— యతులవారికిఁ భక్తిపరవశత్వంబున దేవుఁడే ప్రదేశము ననుండునది కానరాదు కాబోలు?

అర్జు:— మోహినీ! కాదు. సుభద్రా! కాదు! కన్యామణీ! నీవా? నీశిరమునందున్న చంద్రవంకనుఁగాంచి నీకంఠమందలి స్వర్ణపన్నగహారమునుఁజూచి నీవు చంద్రమౌళివనుకొని నిన్నుఁబూజించితిని.

సుభ:— ఇంతపరవశమొందుటకు నేఁడుపవాసమొనర్చు బర్వదినమకాదే?

అర్జు:— ఏలకాదు? నీనీలాలకలను గనుగొన్న నమావాస్యయగును. నీనెమ్మోముగన్న పున్నమయగును. కావున నీయెదుట నాకు సంతతోపవాసము, నిరంతరపారవశ్యము.

సుభ:— యతీంద్రా! నాకుఁబోవ సెలవిండు.

అర్జు:— (స్వ) ఆహా! మోసమాయెను. ఎంతభ్రాంతుఁడనై వర్తించితిని? దీనిని సవరింపవలయును. (ప్ర) కన్యామణి! నీస్వామికి నీపైఁ బూర్ణానుగ్రహము కలిగినది. నిన్నరాత్రి స్వప్నమునఁ దెలిసిన యానందవార్తవలన నీతో వినోదములాడితిని. వినుము నీకుఁ బరిణయకాలము పండివచ్చియున్నది.

సుభ:— (స్వ) ఇదియేమి బలభద్రుఁడు చేయఁదలఁచిన బలవంత పరిణయముండునా? భద్రవిజయునకు జాబునిచ్చెనో లేదో? పార్థుఁడు వచ్చునో రాఁడో? దైవమేమి చేయనున్నాఁడో? (ఊరకుండును)

అర్జు:— బాలా! సన్యాసులయెడ సిగ్గేల? పలుకవేల? వివాహమన్న నెంతోయుత్సాహ మెుందుదీరుమాని విచారమొందెద వేల? పంకజముఖీ! సంకోచమునుఁగొంకును ద్యజించి వచింపుము. నీ సౌఖ్యభాగధేయమునకే యింతభగవదారాధన నొనరించెదను. నీమనోవికల్పము లేవేనియుఁ గలవేని, వాటినిఁ దెలిపినచో నందు నకుఁ దగు సంకల్పముచేఁ బూజలొనర్తును. దాచకుము.

సుభ:— మునికులచంద్రమా! మీరు పుణ్యతీర్థంబులయాత్ర గావించుచు నెన్నియో దేశంబులుజూచి యందుల వార్తలెఱిఁగి యుందురుకదా? నేనొకటి మిమ్ములనడుగ నపేక్షించెదను.

అర్జు:— అవశ్యమడుగుము.

సుభ:- సీ॥ రమణీయమగునింద్ర-ప్రస్థంబుగనినావె-
మునిచంద్ర తెలుపుఁడీ-ముదముగదుర?।

అర్జు:- కనుటమాత్రమె కాదు-కలికియాపురమందు-
కాపురమొనరించు-గలిమిగలిగె।

సుభ:- కుశలులేపాండవుల్-గుంతియునచ్చోట-
పాంచాలిక్షేమంబు-బడయుగాదె?।

అర్జు:- పాండవుల్ గుంతియున్-బాంచాలితోఁగూడఁ-
గుశలులైయున్నారు-కుసుమగంధి।

సుభ:- తెలియనాయతివర్య! యలపార్థువృత్తాంత-
మంతయువిననేసంతసింతు?।

అర్జు:- ఎఱుఁగుదువసకపాంగి-యింద్రసూనునివార్త-
నదివిననీకేల-నాసచెపుమ?।

సుభ:- నరుఁడునామేనత్త-వగనూనుఁడగుటచే-
మనమునవిండారు-మమతనాకు।

అర్జు:- నకెట్టిమమతయో-పాకారిసుతుపైన-
యాత్రఁజేయునెభీత-నేత్రయతఁడు।

సుభ:- తీర్థసేవలుసలుపుచోఁ-బార్థుమీరు-
కాంచియున్నారెతెలుపుఁడీకరుణతోడ।

అర్జు:- కంటినరునియతడును నే-గలసియుంటి।
మిరువురును భేదమరయక-నిగురుబోణి॥

కలవాణీ! క్షేత్రంబులలో నర్జునుడును నేనొకటిగాఁగూడి చరించుచుంటిమి. అతఁడు ప్రభాసతీర్థమునకుఁ బోయియుండెను.

సుభ:— ఆప్రభాసతీర్థమున విజయుఁడింకను నున్నాఁడా? మీతో నేమైన జెప్పెనా?

అర్జు:—అతఁడెన్నియో ముచ్చటలుచెప్పెను. అవియన్నియునీ కేల?

సుభ:— (తలవంచి యూరకుండును)

అర్జు:— లలనామణీ! నేను దొలుతనే చెప్పియున్నాఁడను. నీవేదైన దాచితివేని, నాసంకల్పము నిష్ఫలమగును.

సుభ:— పాట (అనుబంధము 22)

దేవా! తపోధనులగు మీకుఁ దెలియనిదుండునా? ఆవిజయుని ......పరిణయమాడ...... నేను జన్మియఁబట్టియున్నదానను.

అర్జు:—కాంతా! నీవింకను బాలికవు. నిలుకడగలవలపు నీయుల్లమున నెలకొనజాలదు. పెద్దలగు వారెవరికిఁ బెండ్లిజేయుదురో వారినే నీవువరింపవలెనుకదా? ఇంతకును విజయుని మనసెట్లున్నదో?

సుభ:— మునీంద్రా! నేను బాలికనైనను నామానసమట్లు చలించునదికాదు.

కం॥ నినువరియింపను చానా!।
అనివిజయుఁడు సేవినంగ-ననినక్షణమే।
తనువునఁబ్రాణములిడుకొని।
మనియుందునెధరణిపైన-మానినుతేంద్రా?॥

అర్జు:- కం॥ నినుఁబోలినధీరగుణన్।
మనమోహనరమ్యరూప-మంజులగాత్రిన్
గనవెందునువిడుచింతను।
వనజాక్షిరో! నరుఁడునిన్ను-బరిణయమాడున్॥

ఇందుముఖి! అందునకే నీకు మోహినియనునామము నాదేవుఁడిడెను. కూర్మావతారపు మోహిని బలిరక్కసుని మోసగించి, యింద్రాదుల కమృతంబు నొసంగెను. నీవు బలరాముని మోసగించి, యింద్రనందనునకు నధరామృతము నిచ్చుదానవు.

సుభ:— స్వామీ! ఇంతపుణ్యము నాకుఁగలదా?

అర్జు:— ఎందుకు లేదు?

సుభ:— నాయన్న బలరాముఁడు నన్ను బలిమిమై దుర్యోధనునకు ద్వాహింపఁదలఁచినాఁడు. మీప్రభావంబున దానిని నిరోధించి నాకుఁ బ్రాణదానమివ్వవలెను.

అర్జు:— కాంతా! భీతిల్లకుము.

కం॥ శశిముఖి! పార్థుఁడుధరపైఁ।
గుశలంబుగనుండుదాక-కురుకుల మెల్లన్।
బశుపతియునుదుర్యోధన।
పశువుకునిను బెండ్లిసేయ-వశమాయెందున్?॥

విజయుఁడు భూమిపైమనియున్న నాకౌరవనీచుఁడు నిన్ను జేపట్టఁగలఁడా?

సుభ:— అయ్యో!

కం॥ నేనెక్కడ? నరుఁడెక్కడ?।
ఈనాసంతాపమునతఁ-డెఱుఁగఁగఁగలఁడా?।
ఓ నాయతి వేఁడెదమిము।
మానీశ్వరమీరెనన్ను-మనుపఁగవలయున్॥

అర్జు:— కమలాక్షి! నీదృఢప్రేమను గ్రహించితిని. నాతపోబలంబున నెఱుఁగజాలనిదొక్కటియు లేదు. నీవుపంపిన పత్రిక నా కన్నులయెదుట నున్నట్లున్నది. చదివెదవినుము.

("అన్న హలాయుధుండు" అనుపద్యమును చదువును)

సుభ:— మునిచంద్రమా! నాపాలిటికి మీరు సాక్షాత్కరించిన భగవంతులు. (నమస్కరించును)

అర్జు:— అందుచేతనే విజయుఁడు ద్వారకకరుదెంచియున్నాఁడు.

సుభ:— ఎప్పుడు?

అర్జు:— మీరు నన్ను రైవతకగిరినుండితోడి తెచ్చినప్పుడే.

సుభ:— ఆహా! మేమొక్కరును చూడలేదె? అతఁడెవ్వరియింట విడిదచేసియున్నాఁడు?

అర్జు:— మీయింటనే.

సుభ:— బలరామునకుఁ దెలియునా?

అర్జు:— తెలియదు.

సుభ:— మాకుఁదెలియక నెక్కడ నుండవచ్చును?

అర్జు:— ఆహా! మఱచితిని. నీవు వ్రాసినపత్రికకుఁ బార్థుడు ప్రత్యుత్తరమిచ్చినాఁడు,

సుభ:— అదినాకుఁ జేరలేదే?

అర్జు:— అది నాచేత నేపంపినాఁడు. మఱచియుంటిని.

సుభ:— అయ్యో! యిట్టికార్యమున మఱపు చెల్లునా? ఆపత్రిక దయచేయుఁడు.

అర్జు:— మఱచిన మఱచితిని. ఈదూతికాకార్యమే నాయతుల కుండునది?

సుభ:— మునీంద్రా! నాప్రాణదాన మొనరింపుడు.

అర్జు:— (పత్రికనిచ్చును)

సుభ:— (చదువును)

ఉ॥ అన్నహలాయుధుండునిను నారడి-బెట్టుచుఁగౌరవేశునీ।
మన్నియ జేసినీమనువుమాపుమనంబున-నున్న నేమగుక్?।
పన్నగవేణి!నిన్ను ననుఁబాలనసేయఁగఁ-గృష్ణుఁడుండఁగాఁ।
ఖిన్నతయేలనే?యతివనేయతినై-నినుఁబెండ్లియాడెదన్॥

(సిగ్గునఁదలవంచుకొనును.)

అర్జు:— పంచచామరము.

సరోజనేత్ర!స్వర్ణగాత్ర! సారథీచరిత్ర!యో।
మరాళయానమోహినీ! తమాలవేణి కామినీ!।
విరాళిమీరనిన్నుబొందు-వేడ్క వేగమొందఁగాఁ।
విరాగబుద్ధిమానియైన-వీఁడెపార్థుఁడంగనా!॥

బాలికామణీ! నీమోహదేవత ప్రత్యక్షమగుఁగాంక్షచే నిన్నిదినంబులు ఘోరమైన జపతపపూజలొనర్చుచుండు విజయుని రక్షించితివి. (చేయిపట్టును.)

సుభ:— (సిగ్గునొందును)

అర్జు:— సుందరీ! నీమోహాతిథ్యముగైకొన నీయాజ్ఞ మేరకరుదెంచియున్న నన్నుఁజేపట్టుము.

పాట—ఇద్దటెది (అనుబంధము 23)

సుభ:— విజయా! కన్యనగు నాచేయిఁబట్ట నీకున్యాయమా?

అర్జు:— ఇంతకన్న న్యాయమైనకార్యము ప్రపంచముననుండనే యుండదు.

సుభ:— ఇంద్రతనయా! నాయన్నకృష్ణుఁడు బలరామునివలెఁగాదు నాకొఱకతనినిఁ బ్రార్థింపుము. ఇప్పుడు ననుఁబోవనిమ్ము.

అర్జు:— శృంగారీ! రంగారు నీబంగారిమేని సాంగత్యము నాకొసంగక భంగపఱచితివేని యనంగుఁడు నాయసువులఁ దొలంగఁ జేయును.

సీ|| కోమ! నీముకురులందె-కుటిలత్వమనుకొంటి-మనమందు గలదంచు-గనఁగనైతి।
చాన! చూపులయందె-చాంచల్యమనుకొంటి-వలపునఁ గలదంచు-దెలియనైతి।
కలికి! దంతములందె-కాఠిన్యమనుకొంటి-దలఁపునఁ గలదంచు-దలఁపనైతి।
బాల! వేనలియందె-మాలిన్యమనుకొంటి-జాడలఁ గలదంచు-జాడనైతి||
గీ|| వెయ్యిపల్కులికేల నే-విద్రుమోష్ఠి!।
పోయె ధర్మగుణము నీదు-బొమలఁ జేరి।
రాగమడఁగెను నీయధ-రంబునందె।
లేమ! ప్రేమంబు లేశముఁ-లేదు నీకు||

సుభ:— రాజకుమారా! శాంతివహింపుము.

చం|| వలదిది మేలుగాదు బలవంతము జేయకు రాకుమారబల్।
జులకనగాదె కాంతలను జూచిన నాతురబుద్ధినొందఁగన్
వలచినకన్యనైతిగద ఫల్గుణ! నిన్నికఁ బెండ్లియాడనే।
బలిమిని జేయు భావమును బైకొనఁగోయుమనంబుమామమా||

పార్థా! త్వరకిది తఱికాదు.

అర్జు:— బింబాధరీ! గాంధర్వమునకుఁ దరియెందుకు?

సుభ:— విజయా! ఎట్లును నీవె నాప్రాణకాంతుఁడవు. ఆతురపడకుము. నేఁడె కంసారికంతయుఁ దెలుపుము. అతఁడు మనలఁగాపాడును.

అర్జు:— నేఁడుబ్రతికినగదా రేపటిసంగతి?

సుభ:— ఆహా! బలరాముఁడువచ్చెను.

సుభ— (పరుగెత్తిపోవును.)

అర్జు:— ఆహా! సుభద్ర యెంతమోసమొనర్చెను?
నారాయణ-నారాయణ.

కం॥ నారాయణనారాయణ!
నా రామమనోజ్ఞ భామ-నవ్వులతో నే।
యీరీతిగ వంచించెన్।
యా రేబలు మోసపోతి-నంగనచేతన్॥

(విగ్రహముల పూజా సామాగ్రిల పాఱవైచి, పిచ్చిచేష్టలు చేయును.)

---

## చతుర్థాంకము-ద్వితీయరంగము.

(ప్రవేశము-ఘటోత్కచుఁడు)

ఘట:—శబాస్! మానాటకము ముగియవచ్చుచున్నది. ఆహా! మా విజయుఁడెట్టి దైవభక్తిగల తపస్వి? ఇట్టివారు వెనుకపుట్టలేదు. ఇప్పుడు లేరు. ముందుకలుగరు.

సీ॥ వలచినకలవాణి కోలుచునుతనునంచు-వినినంతవిజయుండు-తనువుమఱచె।
రామసేవలానగ్నఁగామవిభ్రమమొంది-కన్నులార్పక గాంచు-గాంతముఖము।
పుష్పఁబులందివ్యఁబూజకై చేకొని-పుష్పాంగిపైననే-పొగడి వేయు।
ఈదేవి నేగొల్తు-నా దేవుడేలంచు-మంత్రతంత్రములన్ని-మంటఁగలిపె॥
గీ॥ దినమునందంతబరిచర్య తీరకుండు।
పనులఁగల్పించిపడతినిఁగనుచునుండు।
రాత్రియగుచున్న వెలరారి రాపుజెందు।
తెల్లవాటినఁబెల్లుగానుల్లసిల్లు।

ఇంక నాసుభద్రాకన్య సంభ్రమము నేమిచెప్పుదును. ఆ జయుని చింతయే మఱచినట్లున్నది.

సీ॥ రంగారుచెంగావిబంగారుముంగొంగు-సింగారమలరంగఁజీరఁగట్టు।
మరకతవరరత్న పరిసరపరిగత-కర్బురాభరణముల్-గాంతతొడుగు।
కుంకుమపంకంబు-బొంకంబుగాఁబూసి-గమగమజవ్వాజిగంధమలఁదు।
మనసున నెనసినమనసిజసమరూప-పతిగూర్చ్చయతియంచు-బరిచరించు॥
గీ॥ యతిని సేవించుబనులయం-దలఁత లేదు।
ఒక్కనాఁడైనముని సేవ-నుడుగ లేదు।
వేళయెంతైననసన్నిధి-విడచిపోదు।
కంటయతినింతగనకున్న-గంపమొందు॥

బలరాముఁడు నిశ్చయించిన లగ్నదినము సమీపించుచున్నది. ఆల లగ్నపత్రికనిచ్చి బ్రాహ్మణులను హస్తినాపురికిఁ బంపియున్నాను. ఆవివాహపత్రిక వెంటనే సుభద్రాదేవి వ్రాసినట్లు జాబును బంపినాను. అందున నెక్కువేమియులేదు.

గీ॥ వలపులేనిసుభద్రను-బలిమితోడ।
బరిణయింపనలవికాదు-పరుసశేంద్ర!।
అన్నయిడినలగ్నమునసే-యర్జునుండు।
నన్నుఁబెండ్లాడు-రావన్నవలుఁగుజూడ॥

ఈసంతోషకరమగు నామంత్రణపత్రికఁజదివి సుయోధనుఁడు మం, డిపడినను, బలరాముని మనోబలమునునమ్మి తన బంధుమిత్ర బలఁగముతో రావచ్చును. వచ్చిననంతియె చాలును. ఆపాపి కౌరవులను దమజన్మపురికి మారుగ యమధర్మపురికిఁబంపెదను. నాచెలికీవృత్తాంతమంతయుఁ జెప్పినాఁడను.

(నిష్క్రమించును)

(యవనికనెత్తిన పాత్రలు-రేవతి, రుక్మిణి, సుభద్ర, మాధవి. కూర్చునియుందురు.)

రుక్మి:— సుభద్రా! ఇప్పడెంతప్రొద్దయినదనుకొంటివి?

సుభ:— అయిన ప్రొద్దయినది.

ముగ్గురు-పాడుపాట (అనుబంధము 24)

రుక్మి:— ఏమె సుభద్రా? నీనిత్యసేవ నీటఁగలిపెదవా? యతుల వారువేచియుందురు. శీఘ్రముగ బొమ్ము.

సుభ:— నేఁడు నాచేతఁగాదు. నాకాయాసముగనున్నది. ఎవరినైన బంపుము.

రుక్మి:— ఆయాసమున్న మఱియు మేలాయెను. ఆసన్యాసి నీకుసొగసైన మందునిచ్చును.

రేవతి:— రుక్మిణీ! పిల్లదానితోనేమి హాస్యమే?

రుక్మి:— అక్కా! హాస్యముకాదు. ఆయతికి దేహచికిత్స. దాహచికిత్స. మోహచికిత్స, యిట్టివన్నియు బాగుగాదెలియును.

సుభ:— ఇవియన్నియు గావలసినవారే పోని.

(నిష్క్రమించును)

రేవతి:— రుక్మిణీ! నీవు బహుకుచోద్యురాలవే? ఊరకున్న చిన్న దానిని చెనకికినియఁజేసితివికదవే.

రుక్మి:— ఇప్పుడేమాయెను? ఈనాఁడు మునిసేవకు మాధవిని బంపుదము. మాధవీ! నేఁడు నీవుపోవే. పూజాద్రవ్యములు సిద్ధమైయున్నవి.

---

## చతుర్థాంకము-తృతీయరంగము.

(పూజామందిరము-అర్జునుఁడు,)

సీ|| ఇదిస్వర్గమని నేను మదినెంచియుంటిని-ధరణీతలంబని తలఁపలేదు।
అందమౌదేవేంద్రు నందనంబనుకొంటి-ద్వారకయిదియంచు దలఁపలేదు।
కందర్పవరభోగ మందిరంబనుకొంటి-బలరాముగృహమంచు దలఁపలేదు।
పూజించుదైవంబు పూఁబోణియనుకొంటి-ధాతువిగ్రహమంచు దలఁపలేను||
గీ|| అతనుసామ్రాజ్యమును నేలు నాసచేత।
గొన్నిదినములేయతినను కొంటినకట।
చిత్తధనమంతహరియించి రిత్తపఱచి।
వట్టిసన్యాసిఁజేసెనా గట్టువాయి||

నాయవివేకమునకు మేరయేలేదు. ఆలలనామణి ముఖవిలాసదర్శనమొనర్చుచు హరుసమునొందుభాగ్యముగూడ బోవగొట్టుకొంటిని. ఆరాకేందువదన యింకేల నరుదెంచును. దేవుఁడేలేకున్న నాపూజలెవ్వరికి జేతును? ఈకారాగృహవాసమింకెన్నినాళ్ళుండునో? ఎవరోవచ్చుచున్నారు. (ధ్యానమునఁగూర్చొనును)

(ప్రవేశము-మాధవి పూజాద్రవ్యములతో)

మాధవి:— (స్వ) ఈసన్యాసి మాసుభద్రాదేవిని యేమోచేసియున్నాఁడు. ఆమెకుభూతము పట్టించినాఁడు. లేకున్నపడకపైనామె యింతతాపముతో బొరలాడునా? ఇతఁడిప్పుడేమి ధ్యానముచేయుచున్నాఁడో? ఆదేవునకేయెఱుక. నేఁడు గ్రహచారముచాలక నేను సేవకువచ్చితిని. నాపైన నెట్టిగ్రహమును విడుచునో? ఏమైననుకాని (ప్ర) స్వామీ పూజాసామాగ్రిలనుఁ దెచ్చియున్నాను.

అర్జు:— నారాయణ! (కన్నులు తెఱచి కోపమున) నారాయణ (పొమ్మని సైగజేయును)

మాధవి:— (పోక నిలచును)

అర్జు:— (గద్దించి) నారాయణ.

మాధ:— (స్వ) ఈమూగసైగల యర్థమెవ్వరికిం దెలుసును. ఇక నికింతకోపమేల? సుభద్రనుగాంచిన పండ్లు తెఱచువాఁడు నన్ను జూచి పండ్లుకొఱుకుచున్నాఁడే. నేనిట్లనే మరలితినేని, రుక్మిణిదేవికోపించును. పూజచేయించియో లేక చేయించుకొనియో, పోయెదను. (సైగలతో పూజబుచ్చుకొమ్మనును.)

అర్జు:— (కృష్ణాజినము నేలగొట్టును.)

మాధ:— (అదరిపడి దూరమున నిలుచును)

అర్జు:— (పొమ్మని సైగచేయును,)

మాధ:— ఊఁహూ! (పోవనుఅని సైగ)

అర్జు:— (లేచి కృష్ణాజినముతో గొట్టును.)

మాధ:— (దుఃఖమున) మా కెక్కడి సన్యాసిదాపరమాయెను? ఆడవాండ్లపైనఁబడుచున్నాఁడే. అమ్మా రుక్మిణీదేవి! (అనిపిలచును)

(ప్రవేశము-రుక్మిణి.)

రుక్మి:— ఏమె మాధవీ! పిలచితివి. పూజముగిసెనా?

మాధ:— నాపూజముగిసెనమ్మ.

రుక్మి:— ఏమిమాటలేయివి?

మాధ:— పూజమాత్రమే కాదమ్మ. ప్రసాదముకూడ దొరకినది. ఇదిగో! చూడుము. (వీపుజూపును)

రుక్మి:— ఎవరుకొట్టిరే?

మాధ:— ఇంకెవ్వరున్నారిక్కడ? అదిగో! ఆసన్యాసి కోడిని్ఁదిన్న పిల్లివలె నెట్లు చప్పుడులేక కూర్చొనియున్నాఁడు చూడుము.

రుక్మి:— ఎందుకుగొట్టెనే?

మాధ:— నేను సుభద్రగాకయున్నందుకు?

రుక్మి:— (నవ్వి) నీవుపొమ్ము. నేను విచారించెదను.

మాధ:— (పోయి ప్రక్కననుండి జూచుచుండును.)

రుక్మి:— స్వాములవారొకింత శాంతులై పూజగావింపవలయును. అందఱును దీర్ఘప్రసాదములకు వేచియున్నారు.

అర్జు:— నారాయణ (బొమ్మను సైగచేసును.)

రుక్మి:— ఊరకపూజ చేయుదువా లేదా?

అర్జు:— (మరలబొమ్మను సైగజేయును.)

రుక్మి:— ఏమయ్యా సన్యాసి! పొగరు తలకెక్కినదా? దేహముపైన ప్రజ్ఞ తెచ్చుకొనుము.

అర్జు:— (కృష్ణాజినముతో బెదిరించును.)

రుక్మి:— అర్జునా! నీదొంగవేషము నాకుఁదెలియదనుకొంటివా?

అర్జు:— (లేచి నిశ్చేష్టితుఁడగును.)

మాధవి:— (స్వ) ఇతఁడర్జునుఁడా? ఆ-అందుకే-సుభద్ర-ఊ... (ప్రక్కనేయుండును)

రుక్మి:— ఇంతకువచ్చిన విడుతునా? నీవార్త బలరామునకు నివేదించెదను. (పోవనున్న)

అర్జు:— (అడ్డగించి మ్రొక్కి)

మానినీవృత్తము

తల్లిరో! నాదగుతప్పులనెంచక-తాలిమితోదయ-దాల్పవలెన్।
పల్లవపాణిసుభద్రనుఁబొందగ-బాయనిమోహము బాదుకొనన్
మల్లడిమీరగమార్గముగానక-మానిగవచ్చితిమానవతీ!।
చెల్లదు నైరము చేతులు మోడ్చుచు-సేతునమస్కృతిసత్యవతీ!॥

(దేవుని పూలహారము రుక్మిణి కంఠమునవేయును)

(ప్రవేశము-శీఘ్రముగ కృష్ణ.)

కృష్ణ:- సుగంధవృత్తము.

ఏమెరుక్మిణీసతీ!యిదేమిహాస్యకాలమా?।
భామనీవుపార్థునిట్లు-బాధపెట్టనాయమా?।
సోముగ్రమ్మియున్నవాఁడు-సోదరిన్వరింపగా।
ప్రేమతోసుభద్రనిచ్చి-పెండ్లిసేతమింపుగా॥

రుక్మి:— విజయా! నిన్ను నొవ్వనాడినందునకు నన్నుక్షమింపుము. (నిష్క్రమించును.)

కృష్ణ:— మాధవీ! నీవుచూచిన విషయములు మాయన్నకుగాని మఱి యెవ్వరికిగాని చెప్పితివా నీవీపుపగులును.

మాధవి:— అప్పుడే యొకసారి పగిలినది దేవా!

కృష్ణ:— అర్జునా! నీవిన్నిదినములు యతివై శ్రమజెందినందులకు ఫలము కడుపక్వమై భోగ్యమైయున్నది. నారుక్మిణికి నీసంగతి తెలిసియే పరిహాస మొనర్చినది. నీవివాహామునకై సర్వము సిద్ధముగనున్నది. బలరాముఁడు మొదలగువారు పశుపతి పూజార్థమై యంతర్ద్వీపమునకుఁ బోయియున్నారు. వారురాకమునుపే వివాహము నెగడించెదను. నీవు నీకాంతను దోడ్కొని ప్రభాతమగులోపలఁ బురినిదాటి పోవలయును. ఈసన్యాసముమాని గృహస్థుఁడవుగమ్ము.

అర్జు:— కృష్ణా! నీకటాక్షములేకున్న నేనొకనిమిషమైన భూమిపై నిలువగలనా? నీయనుమతిని నెఱవేర్పసిద్ధుఁడనై యున్నాఁడను

సీ॥ శ్రీకరా! మురరిపుభీకరా! భువనప్రభాకరా! శ్రీధరా! ప్రణుతినీకు।
విక్రమక్రమశౌరి! చక్రిధన్విమురారి-నక్రసంహారనీకు-నతులొనర్తు।
నందనందనయరవిందనేత్రముకుంద! -సింధునందననాథ! చేతుజోత।
భూతాత్మ! పరమాత్మ! పూతాత్మ! సర్వేశ! -వనమాలి! నీకిదె-వందనంబు॥

గీ॥ ఓదయాపర! శుభకర! యాదవేంద్ర!।
ఓధరాసుతరమణా! సాధుభరణ!।
కలుషహరణా! బుధావన! కమలనయన।
జిష్ణురక్షణ! వర్ధిష్ణు! కృష్ణ! జయతు॥

(ప్రవేశము-రుక్మిణి సుభద్రతో)

రుక్మిణి-కృష్ణ:— సుభద్రార్జునులకు పూలహారములిచ్చి

(పాట-అనుబంధము 25)

కృష్ణ:— విజయా! ఈకన్యకామణిని, నాయనుఁగు చెల్లెలిని నా సుభద్రను నీకునప్పగించితిని.

సీ॥ చిన్నతనంబునుఁ-డిన్నిదినంబులుగ్ - బ్రేమచే బెంచిన-కోమలాంగి।
యన్నలన్నను చాల-మన్ననతో గాంచి-ప్రీతిచేబొంగెడుభీతనేత్ర।
తలిదండ్రులనుగన్నఁ-దనరారుభక్తిచే-గారవంబొనరించు-గీరవాణి।
నిండుమోహము బెంచి-నివ్వటిల్లగ నెంచి-నిన్నె వరించిన-నీల వేణి॥

గీ॥ యెన్నడొరులయింటికిఁబోవ-కున్న కన్య।
పొన్నుమించారు-మృదువైన-పువ్వుబోణి।
నన్న! యర్జుననీవెంటననుపువాఁడ।
విన్నఁబడకుండఁగాపాడ-వేఁడువాఁడ॥

అర్జున-సుభద్ర:— (పాట-అనుబంధము 26)

అర్జు:— కృష్ణా! నీయుపకారభరంబు, దినదినంబునకు నెక్కుడగుచున్నది. నీయగ్రజుని యాగ్రహంబునకునోడక నిండుకరుణచే నీసైదోడును నాకునిచ్చి కాపాడితివి.

సుభ:—అన్నా కృష్ణా! నాకుమాటలాడ నోరెగయకున్నది. నాజీవనమంతయు నిష్ఫలముగావింపఁ దమకించియున్న కాముపాలుని బ్రియత్నము బోరిపుచ్చి నాయభిలాషను సఫలంబుగావించి, నన్ను బోషించితిరి. (అనుబంధము 27)

కృష్ణ:— ఇంకప్రయాణముగండు. విజయా! ఇంతత్వరలో నిన్నెడబాయజాలకున్నను విధిలేక నేనె నిన్ను జాగ్రత్తగబంపవలసి, వచ్చినది. మనఘటోత్కచుఁడు రథమాయతము జేసియున్నాఁడు. మీరుతడయక పురముదాటి వెడలుఁడు.

---

## పంచమాంకము-ప్రథమరంగము.

(పాత్రలు-బలరామ, కృష్ణ.)

బల:— కృష్ణా! నేఁడెట్టి సంతోషదినమో నీకు జ్ఞాపకమున్నదా?

కృష్ణ:— అన్నా! మఱేమివిశేషము?

బల:— నేననుకొన్నట్లెయయినది. నీకుఁదెలుపకనే నేనొనర్చిన కొన్ని రహస్యకార్యములున్నవి. నన్ను మన్నింపుము.

కృష్ణ:— ఏమివిషయము? పెద్దవాఁడవు నీవేమిచేసినను నేనుగాని మఱియెవ్వరుగాని వలదనగలమా? నామన్నన నడుగనేల?

బల:— నీక్షమాగుణము నెఱిఁగయే యింతధైర్యముగఁ జరించితిని. హస్తినాపురికి నేను లగ్నపత్రిక బంపితినే, యందున నిశ్చయించిన వివాహదినమునేఁడే-నేను శకునితో రహస్యముగ మాట

లాడి లగ్నదినమువఱకుఁ గౌరవులు ద్వారకకు రాఁగూడదని చెప్పియుంటిని. మనచెల్లెల పరితాపమును దిలకించి, బాహాటముగ బెండ్లి సన్నాహములను జరిపిన బాగుగనుండదని లోలోపలనే యంతయు సమకూర్చియున్నాఁడను. నేనంతర్ద్వీపమునకుఁ బోయినదందునకే. ఇంత జేసినది మనసుభద్రయొక్క- క్షేమము కొఱకే.

కృష్ణ:— అందుకు సందేహమేమి?

బల:— ఇఁకను నేబంపిన చారుఁడు రాకున్నాఁడు? కౌరవులీముహూర్తమునకు వచ్చెదరో లేదో?

కృష్ణ:— ఏముహూర్తమునకు వచ్చిననేమి?

బల:— ఇట్లైలందువు?

కృష్ణ:— కాఁదగినదంతయు నైనదికదా?

బల:— నిస్సందేహముగనైనది.

(ప్రవేశము-సేవక.)

సేవక:— మహారాజునకు జయమగుఁగాక! కౌరవులు వచ్చియున్నారు. కాని, భీకరులైయున్నారు.

బల:— భీకరముగాదురా-దుర్యోధనుని గంభీరమేయట్టిది.

సేవ:— వారు బాణములు గోటకుగుఱిపెట్టి బాకులు కతారులు ధరించిన రౌతులను వేలకొలఁది సాళ్ళుగట్టించి నిలిపి బెదురుపుట్టించుచున్నారే?

బల:— అదియే గాంభీర్యము. తెలిసెను. నీవుపొమ్ము,

సేవ:— (పోవును.)

బల:— కృష్ణా! కౌరవులు బహుదాంభికులు. వారికిఁదగిన మర్యాదలు జరుగవలెను.

కృష్ణ:—ఇదివఱకు జరిగినవి. ఇంకను జరుగగలవు.

(ప్రవేశము-సేవక)

బల:—ఏమిర మరలవచ్చితివి?

సేవ:— అతఃపురమున మిగుల సందడికలిగినది దేవ.

బల:——సహజమే. పెండ్లిసమయముసగాక నిం కెప్పుడు సందడికలుగును? ఇంకను సాధ్యమైనంత సందడికాని. అట్లయిననే కౌరవులకు సమాధానము. కృష్ణ! ఇంకతడవేల? కన్యనుఁదోడ్కొని పోవుదమురమ్ము.

సేవ:— మహారాజా! కన్యమ్మగారులేరు.

బల:— ఏమిమాటరా యిది?

సేవ:— నేనుజెప్పిన సందడి యిందునకేదేవ. సుభద్రమ్మగారంతః పురములోఁ గానరాకున్నారు. అందఱు శోకించుచున్నారు.

బల:— ఆహా! ఇదేమి పిడుగుపాటు? సుభద్ర యేమాయెను. (కూలఁబడి) కృష్ణా! ఇదేమి సంకటము? నాకు జెచ్చవాటుగలుగుచున్నది. ఏమిచేయవలెను?

కృష్ణ:— ఏమిచెప్పుటకును నాకును దోఁచకున్నది.

బల:— కృష్ణ! సుభద్రను వెదకించుదము. కాని, తొలుతవచ్చిన వియ్యపువారికేమి ప్రత్యుత్తర మియ్యవలయు? నగుబాట్లాయెనే?

కృష్ణ:— మనసంకటములో మనముండగ వారు నవ్వుటకుఁజెరలాటకాదు. కొంతసేపటికంతయుఁ దెలుసును.

బల:— మొదలు సుభద్రవార్త విచారింతమురమ్ము.

ప్రవేశము-సేవకుఁడు.

సేవక:— రాజేంద్రా! స్వాములవారి పూజామందిరములో సుభద్రమ్మగారున్నారేమోయనిపోయి వెదుకగా యతులవారును గానరారు. వారికాషీనదండకాష్ఠములుమాత్రముండగా వాటినిదెచ్చితిని. ఇవిగో! (అనిచూపును.)

బల:— కృష్ణ! మోసమాయెను. ఆదుష్టయతియేమియుఁ దెలియనికన్యను వంచించి వెంటఁగొనిపోయినట్లున్నది.

కృష్ణ:— అన్నా! నాకునట్లే తోఁచుచున్నది.

బల:— అయ్యో! యాదవకులమునకెట్టి యవమానము గలిగెను? మనచెలియ లోకసన్యాసి వెంటఁబోయెననుమాట జనులువిన్న నెంత పరిభవమగును? ఇంక మనబ్రతుకెందుకు?

కృష్ణ:— అన్నా! నేను మొదటనేవలదంటినే? కొండపైగూర్చున్న వానిని నగరునకుఁ దెచ్చితివి. అంతఃపురములోనే యుంచితివి. తుదకు సుభద్రను వాని పరిచర్యకు నియమించితివి. సన్యాసి వానిబాధతీర్థ మందఱి దలలపైన బ్రోక్షించితివి. వానివలననే సుభద్రకు సౌఖ్యముగలుగునని చెప్పితివి. నీవు చెప్పినట్లయా యెను. ఆనిర్భాగ్యుఁడైన దుర్యోధనునకు బాలికనిచ్చెదనని నీ వేల పట్టుపట్టితివో? అందుచేతనే యిన్నిసంకటములుకలిగి కొనకు మర్యాదలు పోగొట్టుకొను నట్లాయెను.

బల:— కృష్ణా! నీమాట వాస్తవము. ఇప్పుడేమనుకొని యేమి ప్రయోజనము? జనులు పరిహసించుబ్రతుకు నాకువలదు. నేను సన్యాసినై యేదైన నరణ్యము జేరెదను.

(ప్రవేశము-సైనికుఁడు.)

సైనిక:— రాజేంద్రా! కౌరవులు త్వరితులై భీతిఁగలిగించుచున్నారు.

బల:— ఇచ్చట మాప్రాణములుబోవుచుండ వారితురితమును విను వారెవరు? పడియుండమనుము.

సైనిక:— రాజేంద్రా! మఱియొకమాట-వేకువ చీకటిలో నెవ్వరో రథమునెక్కిపోవుచుండ, మేము వారినడ్డగించితిమి. వారు యుద్ధమాడి పురిపాలకుల నందఱిని సోలించిపోయిరి.

బల:—ఇందఱు రండలుండ యాదవులకెట్లు మర్యాదలుదక్కును?

సైనిక:— దేవా! అర్జునుని జయించునట్టి శక్తి మాకుఁగలదా?

బల:— ఏమి? ఏమి? అర్జునుఁడు-రథముపైననా-అంతయు విశదము గజెప్పుము.

సైని:— దేవా! తెల్లవాఱుచున్న సమయమగుటచే నర్జునుఁడు సుభద్రాదేవిని రథముపైన గూర్చుండబెట్టుకొని పోవుచుండునది మేము కన్నులార జూచితిమి. వెంట నొక రాక్షసుఁడుండెను. ఇంకొకస్త్రీ ముసుఁగువేసుకొనియుండెను. శ్రీకృష్ణునిబాదము లాన నీవార్త నిజము.

బల:— ఆహా! కృష్ణా! పార్థుఁడు జేసిన మోసకృత్యము వింటివా?

కృష్ణ:— వింటిని.

బల:— ఏమి? తిన్నగవింటిని యనెదవు?

కృష్ణ:— మ ఱేమిచేయమనెదవు? నీవలెనే దుముకులాడుదునా?

బల:— ఆదుష్టుని నేనూరకవిడుతునా? ఇప్పుడేపోయి వానిని ధ్వంసము జేసెదను. (పయనమగుచుండ)

(ప్రవేశము—నారద.)

నారద:— బలభద్రా! ఇదేమి ప్రళయకాల రుద్రునివలె జెలరేగి యెచ్చటికరిగెదవు?

బల:— ఆపార్థుఁడొనర్చిన పరిభవంబునకువానిని సంహరింపఁబోయెదను.

నార:— విజయుఁడేమి చేయరానిపనినిఁ జేసెను?

బల:— దొంగసన్యాసియైవచ్చి, సుభద్రాంగనను చౌర్యమున హరించెను.

నారద:— గీ|| వెన్నదొంగకుసఖుఁడైన-వన్నెకాఁడు।
కన్నెదొంగయగువెరవు-గానకున్నె?।
బన్నమెన్నక కవ్వడి-భిన్నుఁడగునె?।
చిన్నిపొన్నరి కన్నెకు-జెన్నుకాఁడె?||

ఇదియునుగాక దేవకీ వసుదేవాదులు సుభద్రను విజయునకే వివాహముజేయ నభిలషించియుండలేదా? నీవొక్కఁడవేకదా సుయోధనునకు వచనమిచ్చినది?

సీ|| రామనీకొకని కే-రాకేందువదననా-కౌరవపతికిచ్చు-కాంక్షగలిగె।
నీవారునరునకే-నీరేజముఖినియ్య-నిశ్చయించిరిచాల-నీతియరసి।
నీముద్దుచెలియలా-నీటుకాని నెకోర-నెయ్యానవరియింప-నియమమొందె।
పాకారిసుతునకా-పాటలాధరిపైన-బాటవంబగుప్రేమ-బాదుకొలిపె||
గీ|| నాతిపైప్రీతినరునిస-న్యాసిఁజేసె।
సకలముసమకూడెముహూర్త-సమయమునకు।
నీవెయిడినలగ్నబలంబు-నెగడిరాగ।
బరఁగెనాసుభద్రాకన్య-పరిణయంబు||

అయిన కార్యమయినది. నీవుదాని మరల్పగలవా? వృథా నిష్ఠుర ములఁబొలగుదువు.

బల:— కృష్ణా! నాకుఁజూడ యీకపటక్రియలన్నియు నీకు దెలిసియే జరిగినట్లు తోఁచుచున్నది.

నారద:— కం॥ నామనుఁడెఱుఁగ కవిజయుఁడు।
వామనయననపహరింప-వలనగుబనియా?।
ఏమనవలెనింతైనను।
నీమనమున వెఱ్ఱిమాన-నేరవుమా?॥

బల:— నేనువచనమిచ్చి భ్రష్టుఁడనగుదునా? ఆకుటిలాత్ముని నేలఁ గూల్చుదాక నిమ్మళింపఁజాలను. నన్నడ్డగింపకుఁడు.

నార:— బలభద్రా! నీకిదివఱకునైయుండునట్టి యవమానమునకు దోఁచుగ యుద్ధాపజయదుర్యశముగలిగిన బ్రమాదమగును. నీవు ధ్వంసము జేయను విజయుఁడు సామాన్యుఁడనుకొంటివా?

సీ॥ జంభారివరపుత్త్రుఁడంభోధి గాంభీర్య-సంభృతుండగువాఁడు-సవ్యసాచి।
యుద్ధంబులోనిల్చి-యోధులందఱిగెల్చి-సాధించెద్రౌపదిన్-సవ్యసాచి।
కర్ణుఁడాదిగనెల్ల-కౌరవవీరుల-శౌర్యంబుసమయించె-సవ్యసాచి।
భావుకుఁడుగుచును-భద్రపాణినిబట్టి-భవ్యుఁడై వెలయునా-సవ్యసాచి॥
గీ॥ భూమిపాలకసూనుఁడు-భూరిబలుఁడు।
కామినీజనకాముఁడు-కాంతియుతుఁడు।
కుంతిప్రీతితోఁ బెంచిన-గూర్మిసుతుఁడు।
రామ! నీకేలవిడువిడు-రౌద్రమిపుడు॥

(ప్రవేశము—సైనికుఁడు.)

సైనిక:— బలరామభూపాలా! కోటవెలపటినుండి కౌరవులు బలు కలకలము జేయుచున్నారు. వారుచెప్పునదేమన్న "బలభద్రుఁడు సుభద్రను మాచేతికి నప్పగించునా లేక యుద్ధమాడునా?" ఏమాటయు వడిగజెప్పుఁడు, అని కేకలు వేయుచున్నారు.

బల:— ఆహా! దుష్టదుర్యోధనున కింతబొగరా? వేలకొలఁది జన్మములెత్తి కోట్లకొలఁది తపములొనర్చినను లభింపనికన్యయా నిర్భాగ్యునకుఁదక్కునా? నాతోడవీఁడు యుద్ధమాడునా?

కృష్ణ:— అన్నా! చూచితివా? విజయునకును సుయోధనునకును గల తారతమ్యము? ఫల్గుణుని నోటనుండి యీలాటి తులువ మాటలు వెడలునా? పార్థునకు నీయందు బితృవాత్సల్యతపెంపుగనుండునది నీవెఱుఁగవా?

బల:— కృష్ణా! సత్యము. నీమాటనిజము. సుభద్రకు విజయుఁడే తగును. విజయునకు సుభద్రయేతగును. వారిని బిలుపింపుము. నేనుబోయి యీకౌరవనీచులనాముసలమునకు బలియిచ్చెదను.

(ప్రవేశము-ఘటోత్కచ.)

ఘట:— ఆపనిజేయ నేనుండ నీకేల బ్రయాసము?

బల:— (ఆశ్చర్యమున) ఘటోత్కచకుమారా! నీవెప్పుడు వచ్చితివి?

ఘట:— బలభద్రా! పర్జన్యయతిశిష్యునిగర్జన్యు నప్పుడె మఱచితివా?

బల:— ఓహో! నీవేనా యీవంచనా విప్రుఁడవు?

ఘట: — యాదవేంద్రా! నాయపరాధము క్షమింపుము.

బల:— భీమపుత్రా! నీకు సర్వస్వాతంత్ర్యము నిచ్చితిని. నీయిష్టమైనపనిజేయుము.

ఘట:— భాగ్యము. ఆకౌరవులపేరులేకుండ నొకక్షణమున పరిమార్చి, నామాయను బ్రసరించి వారిని బరుగెత్తించెదను. సుభద్రా విజయులఁదోడితెచ్చి నీచరణసన్నిధిని నిలిపెదను.

———

## పంచమాంకము-ద్వితీయరంగము.

వివాహమంటపము.

బలరామ-కృష్ణ-నారద-అర్జున-ఘటోత్కచ-సుభద్ర-మాధవి-రుక్మిణి-రేవతి-బ్రాహ్మణులు.

అర్జు:— బలభద్రా! నానేరములు మన్నించి, నాపైనగరుణ ప్రసరింపజేయుము.

సుభ:— అన్నా! నీచెల్లెలి దప్పులను నీమనంబున నునుపక దయా హృదయంబున నెప్పటివలె నను బాలింపుము.

బల:— ప్రియబాంధవా! విజయా! నేనవివేకినై యీముద్దుబాలికను దురాత్మునకు నియ్యదలంచియుంటిని. నాకు బాగుగ బ్రాయశ్చిత్తమాయెను. కోపపరవశత్వంబున నిన్నెంతగనో దూరితిని. నాయపరాధములను నీవు క్షమింపుము.

అర్జు:— బలభద్రా! నీవెన్నటికైన నపరాధివగుదువా!

నార:— ఇంక వెనుకటి మాటలతో నేమిప్రయోజనము? కల్యాణోత్సవంబులు జరుగనిండు.

బల:— విజయా! నేను దిృకరణశుద్ధిగ నీకాంతారత్నమును నీకు సతిగ నర్పించినాడను. ఇదివఱకే యుద్వాహమైయున్నను నా కన్నులయెదుట గల్యాణోత్సవము గావించెదను.

నార:— ఈసందడియందు భద్రా ఘటోత్కచులను మఱువకుఁడు

బల:— వారిసంగతియేమి?

నార:— సుభద్రాకల్యాణముతోగూడ భద్రాకల్యాణముగూడ నెగడవలయును.

బల:— ఇదియేమి చిత్రము?

నార:— నేఁడు నీకన్నులకన్నియు విచిత్రములే. నేనంతయుఁ జెప్పెదను. భద్రను బిలుపింపుఁడు.

(ప్రవేశము- భద్ర.)

బల:— భద్రా! వచ్చితివా? నీవేసన్యాసి వెంటబోయితివో యని నాకు భయమైయుండెను. భీమనందనా! నీతల్లిహిడింబ భీముని యెడ సౌమ్యసుందరియై యెట్లుమెలఁగెనో యదేవిధాన నీభద్రయెడ జయుఁడవై యేయుండుము. ఉత్సవముగానిండు హారతులు వెలుఁగుఁడు.

అందఱు-పాట అనుబంధము 28

 మంగళము. 

# సుభద్రార్జునీయము.

## అనుబంధములు

నాగకన్య. **1.**—పుట 3 యదుకుల కాంభోజి.

1. ఈరాజకొమరుండు—నీరేజలోచనుఁడు
   మారాణికోరుసుందరుఁడు॥
2. ఫన్నీరుముఖమందు—జెన్నార వేయక
   పున్నాగవేణినేపొందగావలచుౕ॥

నాగకన్య. **2.**—పుట 4 హిందు-మిశ్రి.

సారసాక్షి! కన వేశౌరిని
మారమోహనాంగుఁడైన—మానినీనిహారుని
కోరికొల్వ వేడ్క—లెంతొ—మీారు నేసొంపారునే
చేరబోదమురారె—చిన్నికృష్ణుజూడ మోదాన
ధీరుఁడైనకంసారిగని, పూజింప—తీరు
తాపంబు—బిగానవరంబులొసంగురారె ॥సార॥

అర్జున. **3.**—పుట 7 హిందు-మిశ్రి.

మదిగసలకవినవే, కాంతా! ఘనవ్రిత
మునను, విరాగినైనరీతినున్న మోహపీ్రతి
మానసంబులోన—బూన—నౌనచాన॥

ఉలూపి:—మదివలచితినినునే, నాథా! బలముగ
మనము విమోహలీల, బొందువేళ, బాసి
యుండజాల, దీనురాల, కానవేల—తాళ॥

అర్జున:—తాపమునీడెందమున—తగదుతలపగా
తరుణీమణియీా—తమివిడుమా
దైన్యం, బీ—రీతిౕ—జెందంగౕ—
ధరణి, జనులు, నగరె, మగువ
దార్ఢ్యంబుౕ—విడువేగ—తారుమారునుమా
నంబుతోడ—మానిపొమ్ము॥

ఉలూపి:-వైరయుపై రాగ్యమును, వదలుమురమణా!
వనితామణిపై -దయగనుమా
వాదేల్క, నా-కాంతా-యింతే
వసుధ-నసువు-లిడగ-గలన
బాలనునే, తాళజాల-ప్రాణనాయక
నా-బాళిదీర-కౌఁగిలీర॥

అర్జున. 4.—పుట 8 హిందు-మిశ్ర.
ఎంతమహాపుణ్యంబొ చేసితి-నింతినినుగాంతగానొందితి
కడుసంతోషమా రె-వగపంతయుదీఱె
యశమెంతయొచే రె-తసరా రె-కాంతిమీ రె--చింత పా రె
॥ఎంతమహా॥
ఉలూపి:-ఏలనను నీలాగు నెంచెదు-చాలకొనియాడగఁబోలదు
వెతదూలించి నన్నా-దర, శీలంబుతోన
పరిపాలింతుగాన-మనుదాన-నింపు నే
నా-నందమున ॥ఏలనను॥
అర్జున:-పటుప్రేమపొందుచునా-యర్థాంగివై తివి
పావనశీలప్రియభామా
అతిమాన-వితాన యుతజ్ఞాన-విధాన
యగుచాన-జగాన-నెచటైన
ఆరసిన-గాంచనౌన? ॥ఎంతమహా॥
ఉలూపి:-పరదైవమంచుదన-ప్రాణేశు నెంచని
వామాక్షి భూమిమన, నేల?
వరశీలా-విలోల విధిబోల-విశాల-సుఖలీలా
నుకూల-మగుచాల-పాపజాల-మాపు జెల్ల ॥ఏలనను॥
అందఱు, 5.—పుట 8 హిందు-మిశ్ర.
రాజరాజాననా-రమాలోకమాతా-రమ్యాంగి ॥రాజ॥
సామజగమనా-సారసవదనా-వామసు
వదనా- వారిజనయనా
శౌరి రాణీ-నాగ వేణీ-కీర వాణి-సౌఖ్య వేణీ
సంగదోర్ణీ-లోకవర్ణి-తాబ్జపాణీ-శ్రీకల్యాణి

సారరీతిగావవే-నిండారుప్రీతి
ధీర, శూర, వీర, భావమియ్యవే-దైత్యారి-దేవి
పరమాదరణకా బరికించి ధరణిని దరుణుల తమ
మార తరుచుగ మదిగల తమిమీర యిరవుగ మనుపవె
యిందిరా! ॥రాజరాజాననా॥

ఇలా-బభ్రు. 6.—పుట 9 మిశ్ర.

బలరెయెగిరిముందుపోవు బంతినాదిరా
నాదిరా నాదిరా నాదిరా
నిలచెనీ, బంతిపోదురా నీవోడితివిశబాస్
గెలుపునాదిరా నాదిరా నాదిరా॥

1. ఇంకొకసారి యింపలరారి యిట్లేబలముగ నెగురుచుపారి
యెంతపైకివేతునో చూతులేర చూతులేర
తాళరా తాళరా తాళరా॥

2. పంతముగట్టి బంతినిబట్టి యెంతోసొగసుగ నాడినజెట్టి
యింతగెలుపునొందితి నింకనేను యింక
నేను రానురా రానురా రానురా ॥బలరె॥

ఇలా-బభ్రు. 7.—పుట 10 మిశ్ర.

కడుబలుఁడైనను జడియకరమ్మా వడిజేయగరణము
కనంగా నౌనిక నీబలము ॥కడు॥

1. గురుతరపటిమను నెరపెదగనుమా తరమా ననుగెలువకా
దురముననీ శిరమునునే దునిమెదను ॥కడు॥

2. సమకొని, తమకక, ప్రమదము నిపుడే సమయించెద నిలుమా
సమరమున జయముగన శ్రమయగును ॥కడు॥

ఇలా. 8.—పుట 11 మిశ్ర.

వేగనడువుమా విందునీ, కిడెదము
బభ్రు:-బొమ్మవడిగను భోజనం, బిడెదము
ఇలా:- బాగభుజింతువు పాయసము, మాయింటను
బభ్రు:-కమ్మనిరుచుల కాంచెదవుమా యింటను॥

ఉలూ:-ఏలమీారిటుల ద్వరజేసెదరు బాలకులారా తాళుఁడు
యీాలాగన్నను తడబడలాగి నలుకువ
సలుపగ మేలుగా దలయింపగా నలిచేయగా॥

అంగదుఁ,

## 9.—పుట 12 మోహన.

వాసవనందనపోషణ! వరద్వారక వాసకృష్ణా!॥

1. వనజాక్షా! అమరపాల! మునివినుతా! శ్రీలోల
వనదనీల కాయబలా! ఘనసుకలా! పరమశీల॥

2. సదయాత్మా! సమరధీర! మదజనతాసంహార!
విదితసార శ్రేయకరా ముదితధరాసుతవిహార!॥

నారద.

## 10.—పుట 14 మాల్ కోస్.

నారాయణహరి నందకుమారా!
పారాశరనుత పాపవిదారా॥
భూసురపోషా! భూనుత వేషా!
భాసురకౌస్తుభ భూషా హరి ॥నారాయణ॥

సుభద్ర.

## 11.—పుట 21 హిం॥ భైరవి.

రామా ప్రేమమును గనవేల
భూమిపైనే మనజాల ॥రామా॥

1. కురుపతిపాణినే కోరగలేదే
నెలవగుప్రీతియు నెలకొనలేదే
వెరవగుచోటున వియ్యముకాదె ॥రామా॥

2. ఏవిధికలదో నా వెతమీారె
ఈవగమాన్పగ నెవరునులేరె
దైవమాయొక్కరును కావగరారె ॥రామా॥

సుభద్ర,

## 12.—పుట 21 ఘరజు.

ఎవ్వరింక దిక్కునాకు ఎందుపోదు ఏమిచేతు ॥ఎవ్వరింక॥

1. ఏలనోకృష్ణుఁడునా పాలికేచూడరాఁడే
చాలునాకీ జీవమింక జాలిమీారె తాళజాల ॥ఎవ్వరింక॥

రేవతి. **13.**—పుట 25 మోహన.

జరుగదువినుమా పరిణయము
పరిభావంబుగా బడయంగలవు ॥జరుగదు॥

బలరామ:—పరిణయమును నే జరిపెదను
తరుణీవినవే త్వరితంబుననే ॥పరిణయ॥

రేవ:—ఏటికిట్టికార్యం బీరీతినీవు
పాటికనలేక పైకొనినావు
మాటికి ముమ్మాటికిని చాటిచెప్పదాననేను
కాదు కాదు కాదు ॥జరుగదు॥

బల:—చాలునిట్టిమాటలింక చానా వలదే
గేలిసేయువారు గెలువంగలేరె
చాలపట్టు పట్టినాడ బాలపెండ్లిసేయగను॥
అగును అగును అగును.

రేవ:—కాదు-కాదు.

బల:—అగును.

రేన:—కాదు.

సుభద్ర. **14.**—పుట 25 అ. సావే.

నారీమణిరో నే సైరింపనమ్మ
నాబ్రతుకేవిత యీయెధరణిపై
నవంతయెసంగెను హా-హా ॥నారీమణి॥

భద్ర:—నీరేజవదనా మోదంబొనమ్మ
నీమదిలోవెత, పోపు, వడిగనె
నిలుకడనొందు మమ్మా ॥నీరేజ॥

సుభ:—నేసుఖానమన, నున్నరాముఁడే
నెవ్వగనాకునింతగ నిడఁడె
నెమ్మినెందునా మనంబుగనదే
నెనరునబల్కెదవే ॥నారీమణిరో॥

భద్ర:—భాసురాంగివగ లన్నిమానవే
వాసిగనేగావించెదప్రియము

బాసియుండవే విచారమికను
పడయుము సంతసము ॥నీ రేజ||

భద్రి. 15.—పుట 26 భైరవి
పంకేరుహాక్షిరో వంతేలనేనుండఁ పార్థునేగొనివచ్చెదర
1. కామసుందరాంగుని కనంగనేజనంగను
భామరో జాలిని నీమదఁజెందగ
బాడీయె యూరట గాంచవే ||పంకేరు||

భద్రి. 16.—పుట 29 సురటి.
మోహినీనాకు ముద్దొక్కటియ్యవె
ముద్దొక్కటియ్యవె ||మో హినీ||
1. మందయానవా మనంబుగనవే
అందముజూడవే నా సుందరబాలా ||మోహినీ||

భద్రి. 17.—పుట 33 మాండ్.
వేడుకచాలు విజయుండపీవే వింతలనేలసలిపెదవు
వినుమికనేను విడువనునిన్ను వేగమెరమ్మా
మాపురమునకు ||వేడుక||
ఘుట:-పార్థుఁడగానె పంకజనయనా
పాడియెనాతో యాతగవు|
భద్రి:-పంతంబింతగ పడయక వలచిన
పడఁతినిగొనుమా పరిణయమునను|
ఘుట:-వెలఁదిపాలునకు బెండ్లియేలనె|
వలదికచలము వదలుమునర ||వేడుక||

రుక్మిణి. 18.—పుట 34 హిం|| జంజూటి.
కనుమింపారగనుసీల-వనకాంతిని
వనకాంతిని వనజాక్షియా ||కను||
కృష్ణ:-వనవైల్యంబుకలదునీ ఘనవేణిని
ఘనవేణిని-మనమోహినీ ||వన||
రుక్మిణి:-అందుపీనులకు నానందంబైన
విందునొసంగుర కలకంఠము ||కను||
కృష్ణ:-ఇందెకావించునె విందు నాకుర
ఇందుముఖినీ కలకంఠము ||వన||

రుక్మిణి. **19**—పుట 36. హిందు మిశ్రి.

నీ కింతవినోదంబేల-నినునమ్మియున్నది
వనితనెమ్మది-గనుమా।

కృష్ణ:-సుందరీ, వినోదముకాదే-సుఖమొందు సుభద్రి నిజము॥
రుక్మి:-నా మాంగిక్ష కురుపతిపాణి పడయ జేయ నీకిదిమేలా।
కృష్ణ:-ఆమాటజరుగునా బాలా?
రుక్మి:-నీమాయను నేగనజాల?
కృష్ణ:-కమలాక్షి సదియంజేల?
రుక్మి:-నాథా-
కృష్ణ:-నాతోడవాదమీవేళ-నాతిచేయగా తగదే-వలదే॥

**20**—పుట 46.

ఘట:-సుధనుజిలుకు-నధరపానము సొంపుమీర-సుదతీ కొనెద॥
భద్రి:-సోయగంబుకులుకుచాన సూనశరుని రతిసమాన।
సుందరిని సులభముగ బొందనలవి నీకౌనా ॥సరస॥
పల్లవి॥ సరససుగుణ త్వరయిదేలను
సారమైనసుఖముగనుము॥
ఘట:-కోమలాంగి చలముచాలు ప్రేమదనరనన్ను నేలు।
తామసము చేయకుము కామినియిక నేతాళ ॥సుధను॥

రుక్మిణి. **21**—పుట 48 యమణ,

అనుమానంబెడబాసె ఘనమోదం బెలసె ॥అనుమానం॥
1. మునిమనవిజయుం డనియెడు ప్రేమ
మానసభీతిని మాపె ॥అను॥
2. అతివసుభద్రియా యతిపదసేవ
సతతముజేసిన మేలౌ ॥అను॥

సుభద్రి. **22**— పుట 53 హిందు బేహాగ్.

కటకు వినోదమా మునిచంద్రా!
(నామనస్సును మీరుగ్రహించియుండియు)
నానోటఙబలుకింపగోర
(విజయునినేను పరిణయింపనెంచిన)

వేడుకమీరఁగ వేద్యమగుఁగ ॥కడు॥
(నాకోరికెతీరుకొఱకు నిరతము)
1. మీపదసేవల్, నేగావింతుఁగ।
(నాసేవలకు మీరుప్రసన్నులై)
మిగులఁగ గరుణఁగ మనముననెంచఁగ।
(నేనఁధన్యనై మిమ్ముఁదలఁచుచు)
మెలఁగెదనెంతో, మోదమొంది।
(కావున, యతివర్యా! నాతాపమాఁతి)
మేలుగల్గఁగావుమా ॥కడు॥

వెంటనే అర్జునునిపాట-జిల్లా.

అర్జు:-వర, మరాళయానసీ మనోవిచారంబును।
కడు, బిరానవినుపింపవే నాకు ॥వరమరాళ॥
1. మనములోన, నేమున్నను వనజాక్షి దాచకే।
ఘనవినీలవేణి! అను మానమేలనే వనట దెల్పవే॥వరమరాళ॥

సుభద్ర. 23—పుట55 పహాడ్ కమాజు,

మానవపాలకతనయ వేడు, దానను పంతమేల? ॥పల్లవి॥
అర్జు:-మనము, తనరు, వేళ, మక్కువ,
తూల జనకుబాల ॥అనుపల్లవి ॥మానవ॥
సుభద్ర:-1. చాలగప్రేమ, వెలయనిమ్ము సరగబోవగ నిమ్ము।
అర్జు:-ఈ, చలముమానుమా తలకకుమా
ఓ కలికి, మనము, లోనవిచారము
గానక, మేలిమిచెలఁగ నేలుమా ॥మానవ॥
సుభద్ర:-2. మారసుమోహానవదనపార్థ మఱపుజెందగనౌన?।
అర్జు:-ఈ మరులునిల్చునా ముదమగునా
నా మదినిగనిన మోహముతీరున?
మానవె చలము వనరుహాననా ॥మానవ॥

రుక్మిణి. 24—పుట 58 హిందుమిశ్ర.

వనరుహానయనా! మునిసేవకువెస జనుమిక మసలకుమా
అనుదినమలయక, ఘనమగుసంబర మొందుచుంటివే
॥వనరుహా॥

సుభ:-వనితరో యీాదిన మునజనజాలను తనువిడె తపియించుచు।
పనుపుముమటియొక రిని మునిసేవకు పోవనోపనే ॥వనితరో॥
రుక్మి:-పొగలకుయతివా వగబాపునుయతి సొగసగు మందులచే।
మగువరో యరుగక, మసలిననీయతి చెందుతాపము
॥వనరుహ॥
సుభ:-చదురాలవునీ సంగతి తెలియును వదినరో చాలకిను
మదవతినీమది ముదమిక మొదవిన పొమ్ము సేవకు
॥వనితరో॥

అందలు. 25—పుట 62 సురటి.

మంగళంబోసంగు వేగ మాధవుండికను
రంగుమీార పార్థునకు, సుభద్రకాంతకును ॥మంగళం॥
స్త్రీ 1. కన్యనుచేపట్టంగపటముపన్నిన
సన్యాసివానికి మంగళం।
అన్యాయమెంచక హాలధరునివంచించు
పుణ్యాత్ముడితనికి మంగళం ॥మంగళంబోసంగు॥
స్త్రీ 2. పాటించిమేనత్త కొడుకును పెండ్లాడు
నీటుకత్తెకు జయమంగళం
పాటవంబునదనపట్టు సాధించిన
పాటలగంధికి మంగళం ॥మంగళంబోసంగు॥
ఇద్దరుస్త్రీలు:-రామునిమఱపించి రారాజునదరించి
రచ్చ జేసినహరికి మంగళం
కామినిం బెండ్లాడ గోరినచెలికాని
కాంక్షదీర్చిన హరికిమంగళం॥

అందలు. మోహన.

మంగళాంగమానిసంగ కృష్ణ! మంగళం
తుంగకృపాపాంగదైత్యభంగ మంగళం।
1. వరకరీంద్రభరణదురితహరణమంగళం
పరమపురుష! అమరవినుతచరణమంగళం ॥మంగళాంగ॥
2. విమలసత్వవిపుల! కమల,నయన! మంగళం।
అమితసత్యకలిత! శరధి,శయన! మంగళం ॥మంగళాంగ॥

అర్జునుడు-సుభద్ర. **26**—పుట 63 ఉదయరాగము.

వారిజలోచనా! వరగిరిధర! వారిధిసుతవరసుగుణ!
పోరామి, మీరంగ మముగాచు, దయగాంచి,
ఆరాటమాత్చితి కోరికలు నెఱపితివి ||వారిజ||

అర్జు:-తాపంబాఱె, మోదంబయ్యె శౌరీ, మమ్మొగాపాడంగా
తనరగమముమనిచితివిట మనసిజపిత! మారమణ! ||వారిజ||

సుభ:-నీ కరుణను నిరంతరముగా నీరేజనేత్రి యనుపవలయు
నిరతిజొనిపి, ముదము వెలయు, మనముకలిగికొలుతుమనఘ!
నిరంజ నపాప, విదూర, నిరూఢ విచారశ్రీకర ||వారిజ||

సుభద్ర. **27**—పుట 63 యమన్.

తగువరుని, లక్ష్మమాడి తమితీరెసోదరా!
1. సరగనీమది నరిదిరీతిగం కరుణగాంచగా
మరులుకావగా చాలధన్యనైతి ||తమితీరెసోదరా||

అందఱు. **28**—పుట 70 మోహన మంగళం.

మంగళమగణితనామా మణియుతధామా!
మంగళాంగ! ||పరమా||
1. దేవా! శ్రితజన, మందారా!
దితుకుల, మదరిపు పరిహార, గిరిధర శ్రీకర ముంహార!
దీనపాలవరదా! ||మంగళ||
2. సారధీరగుణ!, సురేశ్వవినుతా!
మారజనక! ఘనవిరాగకకలితా!
దురితహరణ! అమలచరణ!
భూరితరపాపహర! శుభకర! ||మంగళ||
3. విమిలవేష! విగతదోష! అమరపోష! అమృతభాష!
సామగాన, లోల, యదుకులవర! ||మంగళ||

---